# శాంతి

(హిందీకథల సంపుటి)

వెరైటీ ఏజన్సీస్ వారి
అరుణ ప్రచురణ
గవర్నరుపేట :: బెజవాడ

ప్రథమ ముద్రణ
1946—47

ప్రతివెల
0-12-0

# ఆధారాలు

| | |
|---|---|
| కౌశిక్ : | అమ్మ, మధురస్మృతి, శాంతి |
| సుదర్శన్ : | కవిపత్ని |
| ఉషాదేవిమిత్రా : | ప్రశ్న |
| జైనేంద్రకుమార్ : | వారివారి అదృష్టాలు |

యూనివర్సల్ ప్రింటర్సు,
బెజవాడ.

Q. H. K.—58
500

5

# అమ్మ

"పెదనాన్నగారూ, నాకో రైలుబండి తెచ్చిపెట్టవూ?" అంటూ అయిదేళ్ళ కుర్రాడు రామజీవనబాబుకేసి పరుగెత్తుకుంటూ వచ్చాడు.

రామజీవనబాబు చేతులురెండూ చాచి-"అలాగే తెచ్చిపెడతా నాయనా!

అని ఇలా అంటూండగానే దగ్గరకువచ్చాడు కుర్రాడు. కుర్రాణ్ణి ఆయన ఒళ్లోకి, తీసుకుని వాడిముఖం ముద్దెట్టుకుని- "ఏంచేస్తావురా రైలు?" అని అడిగాడు.

"అందులో కూచుని చాలాదూరం వెళ్లొచ్చు. నేనువెడతా .... చున్నిని తీసుకు వెడతా. నాన్నగారిని తీసికెళ్ళం. నాకు రైలుబండి తెచ్చిపెడ్తలా. పెదనాన్నగారూ మీరు తెచ్చిపెడితే మిమ్మల్ని తీసుకు వెడతాం."

"ఇంకా ఎవర్ని తీసికెడతావురా?"

కుర్రవాడు ఒక్కక్షణం ఆలోచించి, "అంతే ఇక ఎవర్ని తీసికెళ్లం" అన్నాడు.

దగ్గరలోనే రామజీవనబాబు భార్య కూర్చునివుంది. ఆయన ఆమె కేసి వేలితో చూపిస్తూ "మరి మీ అమ్మను తీసికెళ్ళవూ?" అని అడిగాడు.

కుర్రవాడు కాస్సేపటిదాకా వాళ్ళ అమ్మకేసిచూస్తూ ఉండిపోయాడు. ఆమె అప్పుడు కొంచెం ధుమధుమలాడుతూ కూర్చునిఉంది. కుర్రవాడికి ఆమె ముఖంలోని ధుమధుమ నచ్చలా. అందుకని "అమ్మను తీసికెళ్లం" అన్నాడు.

అమ్మ వక్కపలుకు నములుతూ "మీ పెదనాన్నగారిగానే తీసుకుని వెళ్ళు. నామీద దయవుంచు!" అన్నది.

అమ్మ ఈమాట చాలా తీక్ష్ణంగా అంది. కుర్రవాడు ఆమె శుష్క వివాదాన్ని వెంటనే ఎగరకొట్టేశాడు.

"అమ్మను ఎందుకని తీసుకెళ్ళవ్?" అని అడిగా డాయన.

"అమ్మకు నేనంటే అపేక్ష లేదు"

"అపేక్షగా ఉన్నవాళ్ల నందర్నీ తీసుకువెడతావా?"

కుర్రవాడికి ఆ మాటకి సందేహం తోచింది. అమ్మముఖం చూసే సరికి ఆవిడ తన్ను ప్రేమిస్తుందనే ఆశకలిగింది. అందుకని వాడు మాట్లాడకుండా ఊరుకున్నాడు.

"ఏంరా? మాట్లాడవేం? అమ్మ నిన్ను అపేక్షగాచూస్తే రైల్లో కూర్చోపెట్టుకుని తీసుకెడతావా?" అని అడిగాడు మళ్లీ ఆయన.

పెదనాన్నగారిని ప్రసన్నంగాచేసుకోటానికి వాడు ఊరికే తలమాత్రం ఊగించి అలాగే అన్నట్లు అంగీకరించాడు; కాని నోటితోమాత్రం చెప్పలా.

బాబుగారు వాణ్ణి తమ అర్ధాంగిదగ్గరకు తీసుకెళ్ళి, "ఇదిగో వీణ్ణి ప్రేమగాచూడు. నిన్నుకూడా తీసుకుని వెళతాడు." అన్నాడామెతో. కాని కుర్రవాడి అమ్మ శ్రీమతి రామేశ్వరికి భర్త పరిహాసం నచ్చలా. ఆమె తుంచినట్లు-"మీరేవెళ్ళండి. రైల్లోకూర్చుని నేనేం రానక్కర్లా." అన్నది.

బాబుగారు రామేశ్వరి అన్నమాట వినిపించుకోలా. కుర్రవాణ్ణి ఆవిడ ఒళ్లో కూర్చోపెట్టడానికి ప్రయత్నిస్తూ "అపేక్షగా చూడకపోయావంటే, ఇహ రైల్లో కూర్చోనివ్వడు. - ఏరా మనోహర్!" అన్నాడు.

మనోహర్ పెత్తండ్రిమాటకు సమాధానం ఇవ్వలా. ఆవిడ మనో హరుణ్ణి ఒళ్లోంచి ఒక్క నెట్టు నెట్టింది. వాడు కింపడ్డాడు. ఒంటికి దెబ్బ అయితే తగల్లేదు; కాని వాడి మనస్సుకు తగిలింది దెబ్బ. వాడు ఏడవటం మొదలెట్టాడు.

బాబుగారు వాణ్ణి ఒళ్లోకి తీసుకున్నాడు. వాణ్ణి ముద్దెట్టుకుని బుజ్జగించి ఏడుపు మానిపించాడు. తర్వాత కాసిని డబ్బులు ఇచ్చి, రైలు తెచ్చి పెడతానని మాట ఇచ్చి, విడిచిపెట్టాడు వాణ్ని. మనోహరుడు అమ్మకేసి భయభయంగా చూస్తూ అక్కడినుంచి వెళ్లిపోయాడు.

వాడు వెళ్లిపోయింతర్వాత రామజీదాసు - ఇదేం పని నీకు? కుర్ర వాణ్ణి నెట్టేశావు! వాడికి ఒకవేళ దెబ్బతగిలితే-" అన్నాడు రామేశ్వరితో....

రామేశ్వర ముఖం చిట్లించి, "తగిలినట్లయితే బావుండేది. అబరువు నా ఒళ్లోకి తెచ్చి ఎందుకు ఎక్కించాలి? మీరే వాణ్ణి తెచ్చి నాపైనపడేశారు. మళ్లీ మీరే ఇప్పుడీ మాటలు మాట్లాడుతున్నారు." అన్నది.

"దీన్ని బుజ్జగించటమంటారా?" అన్నాడు లోపల్లోపల తోప్పడి.

"లేకపోతే మరి దేన్ని అంటారు? మీకు ఎవరికష్టసుఖాలూ కనిపించవు. ఎవరి మనస్సు ఎప్పు డెలా ఉంటుందో---మీకు ఈ మాటలంటే ఏం లెఖ్ఖలేదు. మీ కన్నీ వేళాకోళాలు---''

"పిల్లల ముద్దుముద్దు మాటలు వింటూంటే ఎలాంటి మనస్సు కలవారికైనా సంతోషం కలుగుతుంది. కాని నీహృదయంమాత్రం ఏ లోహంతో చేశారో తెలియదు.''

"మీకు కలిగితే కలగవచ్చు. కలగకేంమరి, వాడు మీ పిల్లవాడైనప్పుడు?---ఇతరుల సొత్తుతో ఎక్కడన్నా ఇల్లు నింపుకుంటారా?''

రామజీబాబు కాస్సేపు మెదలకుండా ఊరుకుని "సయానా తమ్ముడి కొడుకునికూడా పరాయిసొత్తుఅనే అనుకుంటే ఇంక స్వధనమని దేన్నంటారో తెలియదు.'' అన్నాడు. రామేశ్వరి కొంచెం ఉత్తేజితురాలై "మాటలు కల్పించి అనటం బాగా చేతనవు. మీ తమ్ముడికొడుకుని మీరేమనుకున్నా సరే. కాని నాకు ఈమాటలునచ్చవు. మన అదృష్టం ఇంత ఇదిగావుంది. లేకపోతే రోజులిలా ఎందుకుంటాయి? మీ ప్రవర్తనమాత్రం ప్రపంచానికి విలక్షణంగా ఉంది. పిల్లలకోసం పూజలు పునస్కారాలూ, వ్రతాలూ ధర్మాలు ఇలాంటి వెన్నెన్నో చేస్తూవుంటారు మానవులు. కాని ఈమాటల్తో మీకేం ప్రయోజనం? రాత్రింబగళ్ళు తమ్ముడి పిల్లల్తో మునిగి తేలుతూ ఉంటారు.''

రామజీబాబు ముఖంమీది అసహ్యాభావం కనిపించింది.

"పూజలూ వ్రతాలూ అన్నీ బూటకం. అదృష్టంలో రాసిపెట్టని దాన్ని పూజలవల్ల ఎన్నడూ పొందలేము. ఇది నా అచంచల విశ్వాసము.'' అన్నాడు.

శ్రీమతి కొంచెం ఏడుపు గొంతుకతో "ఈనమ్మకంతోనే అంతా సర్వనాశంచేశారు. ఈ నమ్మకాలమీదే కూర్చుంటే అంతా పనులెలాజరుగుతాయి! కేవలం అంతా విశ్వాసాన్నే నమ్ముకుని కూర్చుంటే, ఇహ మానవుడు దేనికయినా ఎందుకు ప్రయత్నిస్తాడు?'' అన్నది.

మూర్ఖస్త్రీతో వాదించి లాభంలేదనుకున్నాడు రామజీబాబు. అంచేతనే అతడు భార్యమాటకు సమాధానం చెప్పకుండా అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

రామజీదాసబాబు ధనవంతుడు. బట్టలవ్యాపారం చేస్తూవుంటాడు. వడ్డీవ్యాపారంకూడావుంది. అయనకు కృష్ణదాసు అనే తమ్ముడున్నాడు. ఇద్దరిదీ అవిభక్తకుటుంబం. రామజీదాసుకు సుమారు షుమారు ఇరవైఅయిదేళ్లు అతడి తమ్ముడికి ఇరవైఒకటి, ఇరవైరెండు ఏళ్లూ ఉంటాయి. రామజీదాసుకు సంతానంలేదు. తమ్ముడికి ఒక కొడుకు - వాడే - మనకు పరిచితుడైన కుర్రాడే - మరో రెండేళ్ల కూతురుకూడావుంది.

రామజీదాసుకు తమ్ముడన్నా అతడి పిల్లలన్నా ఎంతో అపేక్ష - అది ఎంత అపేక్షఅంటే, దాని ప్రభావంవల్ల తనకు సంతానంలేదే అన్నచింతైనా ఎన్నడూ కలగలా అతడికి. తమ్ముడి పిల్లల్ని తన పిల్లలగానే భావించుకునేవాడు. పిల్లలిద్దరూ రామజీదాసంటే వాళ్ళ తండ్రికంటే ఎక్కువ చనువుగా ఉండేవాళ్ళు.

కాని రామజీదాసుభార్య రామేశ్వరికిమాత్రం తనకు సంతానం లేదే అని మహా-దిగులుగాఉండేది. అహోరాత్రాలూ అమె సంతానాన్నిగురించే ఆలోచిస్తూవుండేది. తన భర్తకున్న తమ్ముడిపిల్లలమీది అపేక్ష ఆమెకంటికి ఎంతో కంటకంగా వుండేది.

రాత్రి భోజనాదికాలు పూర్తిచేసుకుని, రామజీదాసు పక్కమీద పడుకుని శీతలమంద వాయువుల సౌఖ్యాన్ని ఆనందిస్తున్నాడు. పక్కనే మరో మంచంమీద అరచేతుల్లో తల పెట్టుకుని ఏదో విచారంలో మునిగివుంది. పిల్లలిద్దరూ ఇప్పుడే పెత్తండ్రిదగ్గర్నుంచి లేచి వాళ్ళ అమ్మదగ్గరకు వెళ్ళారు.

రామజీదాసు పక్కకు ఒత్తిగిలి భార్యకేసిచూసి, "ఇవాళ మనోహరుణ్ణి నువ్వంత యిదిగా నెట్టివేసినందుకు నాకింకా కష్టంగానేవుంది. అప్పుడప్పుడు నీప్రవర్తన మరీ అమానుషంగా ఉంటూవుంటుంది." అన్నాడు.

"మీరేచేశారు అలా నన్ను --- ఆరోజున జ్యోతిష్కుడు మనిద్దరి జాతకాల్లోనూ సంతానయోగం ఉందని చెప్పాడు. ప్రయత్నిస్తే సంతానము కూడా కలుగ వచ్చు. అయన ఆ చేయవలసిన ప్రయత్నం కూడా చెప్పాడు. కాని మీరందులో ఒక్క ప్రయత్నమైనా చేసి చూడలేదు. మీరుమాత్రం వీళ్లిద్దరితో మునిగి తేలుతున్నారు. మీరు చేసే ఈ పనులతో రాత్రిం బగళ్ళు నాగుండె రగులుకుపోతుంది. మనుష్యుడు

ప్రయత్నించి చూస్తాడు. ఇహ అవటం అవకపోవడ మనేది అంటారా భగవంతుని ఆధీనం.'

రామజీబాబు నవ్వి, "నీలాంటి సరళస్వభావులకు కూడా---నేనేం చెప్పను? ప్రపంచములోకల్లా ధూర్తులైన ఈజ్యోతిష్కుల్నీ, వారిమాటల్నీ నువ్వుకూడా నమ్ముతున్నావా? వీళ్ళు అబద్ధాలుచెప్పి పొట్టనింపుకునేది." అన్నాడు.

"మీకు ప్రపంచమంతా అసత్యంగానే కన్పిస్తూవుంటుంది. ఈపురాణాలూ, శాస్త్రాలూ అన్నీ అబద్ధమేనా? పండితులేవీ వాళ్ళంతట వాళ్ళు కల్పించి చెప్పరు. శాస్త్రాల్లో ఉన్నవే చెబుతూ ఉంటారు వాళ్ళు. శాస్త్రాలు అబద్ధాలయితే, వాళ్ళు చెప్పేవీ అబద్ధాలే. ఇంగ్లీషం చదువుకున్నారో, ఇహ ఎదటనున్నవాటిని వేటినీ లక్ష్యపెట్టరు. తాత తండ్రులనాటినుంచి అనుస్రుతంగా వస్తున్న వీటినన్నిటినీ అబద్ధాలనేస్తారు."

"నువ్వు చెప్పినదాన్ని అర్థంచేసుకోలేవు - నీదృష్టి ఏదో నీకే. జ్యోతిశ్శాస్త్రం అబద్ధమని నేనేంచెప్పలా. అది నిజమైతే అయివుండవచ్చు. కాని జ్యోతిష్కుల్లోమాత్రం చాలామంది అబద్ధాలు చెప్పేవాళ్ళే. వాళ్లకు పరిపూర్ణమైన ఆ శాస్త్రపాండిత్యం ఉండదు. ఒకటిరెండు పుస్తకాలు చదివి, జ్యోతిష్కులైపోయి, లోకుల్ని మోసగిస్తూ ఉంటారు. ఇలాంటి పరిస్థితిలో ఎలా వాళ్ళమాటల్ని విశ్వసించటం?"

"ఆఁ అన్నీ అబద్ధాలే! మీరొక్కరే నిజం! సరే ఒక్కమాట అడుగుతాను. మీ మనస్సులో సంతానవాంఛ ఎప్పుడూ కలగలేదూ? చెప్పండి?"

ఈసారి రామేశ్వరి భర్తహృదయంలోని సుకుమారమైన ప్రదేశాన్ని పట్టుకోగలిగింది. ఆయన కాస్సేపు మెదలకుండా ఊరుకున్నాడు. తర్వాత ఒక్కసారి దీర్ఘంగా నిట్టూర్చి, "తమసంతానాన్ని చూచుకోవాలనే మనస్సులో యిచ్ఛలేనివాడుంటాడా ఎక్కడైనా? కాని ఉన్నా ఏమిటిచెయ్యటం? లేకపోయింతర్వాత, కలుగుతుందనే ఆశాలేకపోయింతర్వాత, యిహ దాని కోసమని వృథాగా చింతిస్తూ కూచ్చుంటే ఏంలాభం? అదీగాక మన సంతానంవల్ల ఏవేవైతే కలుగుతాయో, అవి తమ్మునిసంతానంవల్లకూడా కలుగుతాయి. వాళ్ల బాల్యక్రీడలవల్ల కలిగే ఆనందం వీళ్ల బాల్యక్రీడల వల్లా కలుగుతుంది. యిహలేదని దుఃఖించటం ఎందుకో నాకర్థం కావటంలా?' అన్నాడు.

రామేశ్వరి కొంచెం కుంఠితురాలై "మీకు అర్థమవటానికి నేనేం చెప్పను? యిందుకనేగా రాత్రింబగళ్ళు కుమిలిపోతున్నది: అయితేపోనీ యిది చెప్పండి? మీ అనంతరం వీరివల్ల మీపేరు ఏమయినానిలుస్తుందా?" అన్నది.

రామజీబాబునవ్వి "అరె! నువ్వుకూడా ఎక్కడో వ్యర్థమైనమాటలు మాట్లాడతావేం? పేరు సంతానం వల్ల నిలవదు, సుకృతం కొద్దీ నిలుస్తుంది. తులసీదాసు దేశంలో పిల్లల్ని తమపిల్లలుగా చూసుకునే వాడు. సూరదాసు చనిపోయి ఎన్నాళ్ళయిపోయింది? యిలాగే గతించి పోయిన మహానుభావుల పేర్లన్నీ వారిసంతానం వుండటంవల్లనే నిలి చాయా? యథార్థానికి సంతానంవల్ల పేరునిలుస్తుందని ఎంతగా ఆశిస్తామో అంతగా పేరు మాసిపోతుందనికూడా ఊహించవచ్చు. కాని సుకృతంవల్ల పేరు ప్రతిష్టలు ఎక్కువవటమే కాకుండా నశించిపోతాయేమో అని శంకే కలగదు. మనఊళ్ళో గిరిధరలాల్‌రాయ్ ఎంతపేరుగలవాడు? ఆయనకి సంతానం ఎక్కడుంది? కాని ఆయన ధర్మసత్రం, అనాధశరణాలయం మూలంగా ఆయనపేరు యిప్పటికీ నిలిచివుంది - యింకా యెన్నాళ్ళవరకు వుంటుందో మనం చెప్పలేము." అన్నాడు.

"కాని పుత్రులు లేనివారికి ముక్తిలేదని రాసివుంది శాస్త్రాల్లో---"

"ముక్తిమీద నమ్మకంలేదు నాకు. ఒకవేళ ముక్తి గలుగుతుందని అంగీకరించినా, పుత్రులు కలవాళ్లందరికీ ముక్తి కలుగుతుందని ఎలా అంగీకరించటం. ముక్తికికూడా సహజమైన ఉపాయం ఉందా? పిల్లలున్న వాళ్ళందరికీ ముక్తి గలుగుతుందా?"

రామేశ్వరి నిరుత్తరురాలై "ఇహ మీతో ఎవరు వాదిస్తారు? మీరు మీముందర ఎవర్నీ మన్నించరు" అన్నది.

మానవుని హృదయం మమత, ప్రేమలతో నిండి ఉంటుంది. ఎంత ఉపయోగపడే వస్తువులే కానీండి ఎంత అందమైన వస్తువులే కానీండి, అవి పరాయివి అనుకున్నంత వరకూ వాటిని ప్రేమించలేడు. అసహ్యంగా ఉండి. యెందుకూ పనికిరాని వస్తువుల్నికూడా తనవి అనుకుంటేమాత్రం వాటిని ప్రేమిస్తాడు. పరాయి వస్తువు యెంత విలువైనదైనా, యెంత వుపయోగకరమైనదైనా, యెంత సుందరమైనదైనా అవి నష్టమైనవంటే

ఎవరికీ కష్టం కాని, దుఃఖంకాని కలగదు. ఎంచేతంటే అది తనదికాదు. పరాయివాళ్ళదిగా? తన వస్తువు చూడటానికి యెంత అసహ్యంగావున్నా ఎందుకూ పనికిరానిదైనా అది నష్టమైనదంటే మాత్రం మానవుడికి దుఃఖం కలుగుతుంది. ఎంచేతంటే అది తనదిగామరి! అప్పుడప్పుడు మానవుడు ఇతరుల వస్తువుల్ని ప్రేమించటముకూడా ఉంటూఉంటుంది అలాంటి స్థితిలోకూడా - ఆవస్తువును తనదిగా చేసుకుని దాన్ని వదలి పెట్టలేనంతవరకు, అథవా తన హృదయములో అవస్తువు నాదేనని ధృఢ మైన సంభావన లేనంత వరకు అతడికి సంతోషం కలుగదు. మమత వల్ల ప్రేమ ఏర్పడుతుంది. ప్రేమవల్ల మమత ఏర్పడుతుంది. వీటి రెండిటిదీ ఎంతో సన్నిహిత సంబంధం. ఈ రెండింటినీ ఎన్నడూ విడి పరచలేము.

రామేశ్వరికి మాత అయ్యే సౌభాగ్యం మాత్రం ప్రాప్తించలేదు, కాని అయినా ఆమెహృదయం మాత్రం మాతృహృదయం అవటానికి సంపూర్ణ మయిన యోగ్యతను కలిగిఉంది. మాతృహృదయంలో ఉండే గుణా లన్నీ ఆమె హృదయములో అంతర్నిహితమై ఉన్నాయి. కాని వాటికి వికాసం మాత్రం లేదు. విత్తనాలు నాటిన భూమిని తడిపి విత్తనాలను ప్రస్ఫుటితంచేసి వాటిని మొక్కలు మొలిపించ లేనివారెవరూ లేనట్లు ఆమె హృదయంకూడా అలా విత్తనాలు చల్లిన భూమిలా ఉంది. అం చేత ఆమె హృదయం బిడ్డల వైపుకే మొగ్గుతుంది. అయినా అబిడ్డలు తన బిడ్డలుకాదు పరాయివాళ్ళపిల్లలని ఆమెకు స్మృతి కలిగి నప్పుడల్లా ఆమెహృదయంలో వాళ్లంటే ద్వేషం, అసహ్యమూ కలుగు తున్నాయి. విశేషించి ఆ సమయములో - అంటే తనభర్త తనకులేని ఆపిల్లలంటే ప్రాణాలు విడిచేసమయంలో - ఆమె ద్వేషం మరింత పెచ్చు పెరుగుతూ ఉంటుంది.

సాయంకాలపు సమయం రామేశ్వరి వరండాలో కూర్చుని చల్లగాలి సేవిస్తూంది. ప్రక్కనే ఆమెతోటికోడలు కూడా కూర్చునివుంది. పిల్ల లిద్దరూ అక్కడే పరుగెత్తుకుంటూ ఆడుకుంటున్నారు. ఈ సమయంలో వాళ్ళు ఆడుకోవటం గంతులెయ్యటం ఆమెకెంతో ఇంపుగా తోచింది. గాలిలో ఎగురుతున్న వాళ్ళ చిన్నచిన్న ఉంగరాలజుట్టూ, పద్మంలాగా వికసించిన వాళ్ళముద్దు ముఖాలు, తియ్య తియ్యని వాళ్ళ చిలుకపలుకులూ, వాళ్ల

ఆడుపులు, పరుగులు ఇలాంటివాళ్ల ఆటలన్నీ ఆమె హృదయాన్ని ఆర్ద్రంగా చేస్తూన్నాయి. చటుక్కునమనోహరుడు చెల్లెల్ని కొట్టాలని పరుగెత్తాడు. ఆది కిలకిలలాడుతూ పరుగెత్తుకుని వెళ్ళివెళ్ళి రామేశ్వరి ఒళ్లోపడింది. దాని వెనకాలే మనోహరుడుకూడా పరుగెత్తుకుంటూవచ్చి ఆమె ఒళ్ళోనే పడ్డాడు. రామేశ్వరి అప్పుడు తనద్వేషమంతా మరచిపోయింది. ఆమె పిల్లల్నిద్దరినీ-సాధారణంగా పిల్లలమీద ఆపేక్షవున్నవాళ్లు యెలాగుండెలకు హత్తుకుంటారో - అలాగే తనగుండెకు హత్తుకుంది. ఆమె ఎంతోతృప్తితో ఇద్దరిని ప్రేమించింది. అప్పుడెవరయినా అపరిచితులు కనుక ఆదృశ్యం చూస్తే, వాళ్ళకి రామేశ్వరే ఆపిల్లలతల్లి అనే విశ్వాసం కలుగుతుంది.

పిల్లలిద్దరూ చాలా సేపటివరకూ ఆమెఒళ్లోనే ఆడుకుంటూ కూర్చు న్నారు. చటుక్కున ఆ సమయములో ఎవళ్లో వస్తున్న చప్పుడువిని ఆ పిల్లల తల్లి ఆక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది.

'మనోహర్! తీసుకో రైలుబండి అంటూ' రామజీబాబు డాబామీదికి వచ్చేశాడు. ఆయన కంఠస్వరం వింటూనే పిల్లలిద్దరూ రామేశ్వరిఒళ్లో నుంచి చప్పున లేచిపరుగెత్తారు. రామజీబాబుముందు ఇద్దర్ని ముద్దులాడి తర్వాత కూర్చొని రైలుబండిని నడిపించసాగాడు.

ఇక్కడ రామేశ్వరికి మత్తువదలి పోయింది. భర్త పిల్లలతో లీన మవటం చూసేసరికి ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి. పిల్లలంటే మళ్లీ అద్వేషం, అఅసహ్యం హృదయంలో కొంచెం మొలకెత్తింది

రైలు పిల్లలకు ఇచ్చేసి, రామజీ రామేశ్వరి దగ్గరకువచ్చి చిరు నవ్వు నవ్వి, "ఇవ్వాళనువ్వు పిల్లల్ని ఎంతో ఆపేక్షగా చూస్తున్నావు. నీ హృదయంలో కూడా వీళ్లమీద నిజంగా ప్రేమ వుందని తోస్తుంది' అన్నాడు

రామేశ్వరికి భర్త అన్నమాట చాలా ఇదిగా తోచింది. తన మాన సిక దౌర్బల్యానికి తనకే దుఃఖంకలిగింది. కేవలం దుఃఖమేకాదు తన మీద కోపంకూడా వచ్చింది. భర్తఅన్నమాటతో తనక్రోధదుఃఖాలు మరింత అధికమయినాయి. తన దౌర్బల్యం భర్తముందర వెల్లడి అయిందనే సరికి ఆమెకు అసహ్యం కలిగింది.

" ఇందుకనే తన సంతానము కోసమని విచారించటం వృథా అంటాను. నువ్వు వీళ్ళమీద ప్రేమ చూపిస్తూ ఉంటే వీళ్ళే నీసంతానం

అనిపిస్తారు. నువ్వు వీళ్ళమీద ప్రేమ చూపించటం నేర్చుకుంటున్నావంటే నాకెంతో సంతోషంగా ఉంది."

ఈ మాటలు రామజీబాబు ఎంతోనిష్కల్మష హృదయంతో అన్నాడు కాని ఇందులో తీక్షణమైన వ్యంగ్యం ఏదో కొంత వున్నట్లు రామేశ్వరికి తోచింది. కోపంతో ఆమె హృదయం ఉడుకెత్తి పోయింది - వీళ్ళకు చావు అన్నా రాదుకదా! చస్తేపీడవదలి పోతుంది. ఎనిమిది ఝాములు కళ్ల ఎదట ఉంటూవుండటం మూలంగా ప్రేమించాలనే లాలన కలుగు తూంది. వీళ్ళ చావుతో గుండెమరింత రగులుకు పోతుంది అని అను కున్నది మనస్సులో.

రామజీబాబుభార్య మౌనాన్నిచూచి 'ఇప్పుడు సిగ్గుపడితే ఏంలాభం? నీఅపేక్షను దాచటం వృథా. దాచుకోవలసిన అవశ్యకమూలేదు'' అన్నాడు.

రామేశ్వరి మండిపడి - "నాకేం పట్టింది? నేనేమన్నా ప్రేమిస్తు న్నానా? మీకోనమస్కారం! వచ్చి వచ్చి ఆదౌర్భాగ్యుణ్ని మీరే నెత్తికెక్కిం చుకుంటున్నారు. ఒక్క ఇంట్లో వుంటూ వుంటాం కనుక అప్పు డప్పుడు నవ్వించటం, పలకరించటం తప్పదు. మొన్న ఇలాగే కాస్త నెట్టానోలేదో దానికిమీదు వందమాటలన్నారు. ఇటు అటూ కాకుండా నాప్రాణంమీదికి వచ్చింది'' అన్నది.

భార్యమాటలు వినేసరికి అయనకు చాలా కోపము వచ్చింది. అయ నచాలా కఠినంగా "ఏలాంటి హృదయమో నీది; ఇప్పుడేగా చక్కగా కులాసాగా కూర్చుని పిల్లలను ముద్దులాడుతున్నావ్! నేనురాగానే రంగుమార్చావు. నీఇష్టమైతే ఏమైనా చేస్తావ్ కాని నేనేమన్నా అంటే మాత్రం గుచ్చుకున్నట్లుంటుంది. నా మాటల్లో ఏం విషం వ్యక్తమవు తుందో తెలియదుమరి. నేను మాట్లాడటం నీకంత చెడుగా తోస్తే మాట్లా డనే మాట్లాడను.. కాని ఇదిమాత్రం జ్ఞాపకము వుంచుకో - ఎప్పుడన్నా ఇహవీళ్ళ విషయంలో దౌర్భాగ్యుడు - దరిద్రుడు లాంటి తప్పుడు మాటలు మాట్లాడావంటే బాగుండదు. నీకంటె వీళ్ళు నాకెక్కడ ఇష్టులు'

రామేశ్వరి దీనికి సమాధాన మేమీ చెప్పలేదు. తనబాధను, తన కోపాన్ని ఆమె కళ్ళతో వ్యక్తం చేయసాగింది.

రామజీబాబుకు పిల్లలమీది వాత్సల్యం ఎలా యెలా అభివృద్ధి అవు తుందో అలాగే రామేశ్వరికి ద్వేషమూ, అసహ్యమూ కూడా ఎక్కువవుతూ

వచ్చింది. తరచుగా పిల్లల విషయమై భార్యాభర్తలకి వాదోపవాదాలు జరుగుతూ ఉంటాయి. రామేశ్వరి భర్తకతినోక్తులు వినవలసి వుంటూ ఉంటుంది. పిల్లల మూలకంగా తాను భర్తదృష్టికి చెడుగా కనిపిస్తు న్నానే అని తోచేసరికి ఆమె హృదయంలో తుపాను బయలుదేరింది.--- పరాయి పిల్లలమూలంగా ఆయన నన్నొకట్టే ప్రేమించటములేదు. నన్నె ప్పుడూ చెడ్డదానిని అని అంటూవుంటాడు. వీరికి ఈ పిల్లలే సర్వస్వమూ నేనేమీ కాను. ప్రపంచములో అందరికీ చావు వస్తుంది. కాని వీళ్ళిద్ద రికీ మాత్రంరాదు చావు. వీళ్ళు పుట్టగనే యెందుకు చావలేదు! వీళ్ళు ఇలా కాకపోతే, నన్నువీరు చూడరు. వీళ్ళు యేనాడు చస్తే ఆనాడు ఆవు నేతితో చేస్తాను దీపారాధన. వీళ్ళే నాసంసారం పాడు చేసారు. - - అని అనుకుంది.

ఇలా కొన్నాళ్ళు గడచిపోయాయి. ఒకరోజున మామూలుగా రామే శ్వరి డాబామీద పక్కతే కూర్చుని ఉంది. ఆమెమనస్సులో అనేక విధాల యిన విచారాలు వస్తున్నాయి. విచారం మరేంలేదు, ఆదే తనకుసంతానం లేకపోవడమే, భర్తకు తమ్ముడి పిల్లలమీద వుండే అపేక్ష ఇలాంటివే,

కొంతసేపు అయేసరికీ ఆమెవిచారాలు ఆమెకే యెంతో కష్టంగాతోచి తన ధ్యాసను మరొకవైపు మళ్ళించుకోటానికీ లేచి అటూ ఇటూ తిరగసాగింది.

ఆమె తిరుగుతూండగానే మనోహరుడు పరుగెత్తుకుంటూ వచ్చాడు. వాణ్ణి చూసేసరికి ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి. ఆడాబా పిట్టగోడ మీద చెయ్యివేసి నుంచున్నాడువాడు.

సంధ్యాసమయం. ఆకాశంలో రంగు రంగుల గాలిపటాలు ఎగురు తున్నాయి. మనోహరుడు కొంతసేపు గాలి పటాలను చూస్తూనుంచుని ఓపటం తెగి ఈడాబామీదపడితే ఎంత సరదాగా వుంటుంది -- అనుకు న్నాడు. చాలా సేపు పడతాయేమోనని అనించి, వాడు పరుగెత్తుకుంటూ రామేశ్వరి దగ్గరకు వచ్చి కాళ్లమీద చరిచి. "నాకు గాలిపటాలు తెప్పించి పెట్టవూ ?' అడిగాడు. రామేశ్వరి విసుక్కుంటూ, "పో" అవతలికి వెళ్ళి మీ పెదనాన్నను అడుగు " అన్నది.

మనోహరుడు కొంచెం బిక్కమొఖంవేసి మళ్లీ ఆకాశంకేసి చూడ సాగాడు. కాస్సేపు అయాక వుండలేక పోయాడు. ఈ సారివాడు లాలనగావచ్చి, ఎంతో జాలి కలిగేట్టుగా - అమ్మా! గాలిపటం తెప్పించ ఊ - - మనంకూడా యెగర వేసుకుందాం " అన్నాడు.

ఈ సారి వీడు బ్రతిమాలటంతో రామేశ్వరి హృదయం ఆర్ద్రమయింది. ఆమె కాస్సేపు వాడికేసి అట్టేచూస్తూ నుంచుంది. మళ్ళీ ఆమె ఒక వేడి నిట్టూర్పు విడిచి, వాడు నాకొడుకే అయినట్లయితే, నా కంటె అదృష్టవంతురాలు ప్రపంచములో వుండేదికాదుగదా! ఆదౌర్భాగ్యుడెంత అందంగా వున్నాడు? యెంత ముద్దుముద్దుగా మాట్లాడుతున్నాడు? వెళ్లీ అమాంతం గుండెకు హత్తుకోవాలని అనిపిస్తుంది. '' అనుకుంది.

ఇలా అనుకుని ఆమె వాడితల నిమిరేదేకాని ఇంతలో మనోహరుడు ఆమెమౌనాన్ని చూచి "నువ్వుమాకు గాలిపటం తెప్పించి ఇవ్వకపోతే పెదనాన్నతో చెప్పి నిన్నుకొట్టిస్తాను '' అన్నాడు.

క్షుద్రవాడి ఈ అమాయకపు మాటల్లోకూడా నిజానికి చాలామాధుర్యం వుంది. అయినా రామేశ్వరి ముఖం కోపంతో ఎర్రబడి పోయింది. ఆమె వాణ్ణి విసుక్కొని, 'పో' చెప్పుకో మీ పెదనాన్నతో. చూస్తా ఆయన నన్నేం చేస్తారో. '' అన్నది.

మనోహరుడు భయపడి ఆమె దగ్గరనుంచి ఇవతలకు వచ్చి మళ్లీ యెంతో ఆశాపూరిత నేత్రాలతో ఆకాశంలో యెగురుతున్న పటాలను చూడసాగాడు.

ఈ పసివాడు నన్ను బెదరిస్తున్నాడంటే ఇదంతా పెత్తండ్రి చనువు చేసినందుకు ఫలితం. భగవంతుడు ఈ చనువును పోగొడితే బావుండును అని అనుకుంది రామేశ్వరి.

ఆ సమయంలో ఆకాశంలోంచి ఒకపటంతెగి ఆడాబావైపుకేవచ్చి రామేశ్వరి తలమీదుగా పోర్టికో వైపుకు వెళ్లింది. డాబాకు నాలుగు వైపులా గోడలున్నాయి. రామేశ్వరి నుంచున్న చోటమాత్రం పోర్టికోలోకి వెళ్ళటానికి ద్వారం వుంది. రామేశ్వరి ఆద్వారానికి అనుకుని నుంచుంది. మనోహరుడు ఆపటం పోర్టికోలోకి వెళ్ళటం చూశాడు, దాన్ని పట్టుకోటానికని వాడు పరుగెత్తుకుంటూ ఆవైపుకే వెళ్ళాడు. రామేశ్వరిచూస్తూ నుంచుంది. మనోహరుడు ఆమె దగ్గరనుంచే పోర్టికోలోకి వెళ్లి రెండడుగుల దూరంలోనుంచుని ఆ పటాన్ని చూస్తున్నాడు. పటం పోర్టికోమీదనుంచి కిందికి ఇంటి ముంగిలిలో పడింది. ఒకకాలు పోర్టుగోడ అంచు మీదపెట్టి వంగి పటం ముంగిలిలో పడటం చూచి సంతోషాన్ని ఆపుకోలేక పోయాడు. వాడు కిందకి వెళ్ళటానికి గబగబా అడుగులు వేశాడు.

కాని ఆ ముందుకు నడవటంలో వాడి కాలుజారింది. వాడు కిందికిపడు తూ ఆ అంచుని పట్టుకొని కాళ్ళుచాచి రామేశ్వరి వైపునుచూచి ' అమ్మా, అని అరచాడు. రామేశ్వరి గుండె జలదరించే ఈ సంఘటన చూసింది. చావనీ-పీడవదలిపోతుంది అనుకుంది అమె. ఇలా ఆలోచించి అమె ఒక్క క్షణం ఆగింది. అక్కడ మనోహరుడి చేతులు గోడనుంచి జారటం మెదలెట్టాయి. వాడు భయంతో జాలిగొలిపే చూపులతో రామేశ్వరికేసి చూచి " అమ్మా " అని అరిచాడు. మనోహరుని చూసేసరికి రామేశ్వరికి గుండె ఖద్దలయింది. ఆమె కంగారుపడి వాణ్ణిపట్టుకోటానికి తన చెయ్యి చాచింది. అమెచెయ్యి మనోహరుడి వరకూ రానేలేదు, ఇంతలోవాడి చెతులోంచి వాడు క్రిందపడ్డాడు. రామేశ్వరి కేకలువేస్తూ· పోర్టికోమీద పడింది.

రామేశ్వరి ఒకవారం వరకు జ్వరంతో స్మృతితప్పి పడివున్నది. అప్పుడప్పుడు అమె గట్టిగా " చూడు చూడు వాడు పడిపోతున్నాడు వాణ్ణి రక్షించు పరుగెత్తు , నామనోహరుని రక్షించు." అని అరుస్తూ వుండేది. " నాయనా మనోహర్; నేను నిన్ను రక్షించలేదు, అవునవును నేను అనుకున్నట్లయితే రక్షించేదాన్నే. నేను ఆలస్యం జెశాను "అంటూ ఇలా ప్రలాపిస్తూ వుండేది.

మనోహరుడి కాలు విరిగిందీ. వాడు క్రమశః మళ్లీ మామూలు స్థితి లోకి వస్తున్నాడు.

ఒకవారమయాక రామేశ్వరి జ్వరం తగ్గింది. బాగా స్మృతి వచ్చాక " మనోహరు డెలావున్నాడు ? " అని అడిగిందామె.

" బాగానే వున్నాడు " అని సమాధానమిచ్చాడు రామజీవానబాబు.

" వాణ్ణి నాదగ్గరకు తీసుకురండి. "

మనోహరుణ్ణి రామేశ్వరి దగ్గరకు తీసుకొని వచ్చారు. అమెవాణ్ణి వాత్సల్యంతో హృదయానికి అదుముకుంది. నేత్రాలనుంచి అశ్రువులు ప్రవహించసాగాయి. ఎక్కిళ్ళతో కంఠస్వరం బొంగురు పోయింది.

రామేశ్వరికి కొన్నాళ్లయ్యే సరికి బాగా ఆరోగ్యం చిక్కింది. ఇప్పుడు మనోహరుడు చెల్లెలు చున్నిని కూడా ద్వేషించటమూలేదు. అసహ్యించు కోటమూలేదు. పైగా మనోహరుడే అమె కిప్పుడు ప్రాణాధారు డయినాడు వాడులేకపోతే అమెకు ఒకక్షణమైనా సుఖంగా వుండదు.

# మధురస్మృతి

స్మృతి :- హృదయంలో కరుణోత్పాదకమైన భావాలతో స్పష్టంగా అచ్చుగుద్దినట్లయిపోయిన, హృదయమర్మ స్పర్శిని అయిన ఆస్మృతిని ఈ జన్మలో తుడిచి వెయ్యటం కేవలం కఠినమేకాదు - అసంభవంకూడా అది యెంత కష్టాన్ని కలిగించేదయినా, యెంత మధురస్మృతి! ఎంత ప్రియమైనస్మృతి! ఆ స్మృతితో హృదయం భగ్గునమండి, మనస్సు మసి అయి పోతుంది. అయినా ఆస్మృతిని చెరిపి వేసేందుకు ప్రయత్నించా లనిపించటంలా. హృదయాన్ని తన వాడియైన పదునుతో రక్తప్లావితం చేసే తియ్యని కత్తిలాంటిదా స్మృతి. హృదయంనుంచి దాన్ని దూరం చెయ్యటానికి మనస్కరించనంత మాధుర్యం తీపి వున్నాయి ఆస్మృతిలో, ఎంచేత ? ఆ ప్రేమ విలువను, కర్తవ్యసీలతా ప్రగాఢత్వాన్ని, ఆమె ఆజన్మాంతం నానుంచివేరై మృత్యుయవని కాంతరంలో అదృశ్యమైపోయి నప్పుడు గుర్తించాను నేను - ఆప్రేమస్వరూపిణిస్మృతి అది ఆప్రేమ మూర్తిని నిజస్వరూపాన్ని - మృత్యు యవనిక బంధనమునుంచిజారి మెల్లిమెల్లిగా మా యిద్దరిమధ్యా పడబోయేముందు - చూశాను. జాజ్వల్యా మానమైన ఆమె యదార్ధస్వరూపాన్ని చూసేసరికి కళ్ళుమూతలుపడి,మళ్లీ తెరువుడుపడేలోపునే అనిష్ఠుర యవనిక ఆమెను తన ఒళ్లోకి లాగేసుకుంది. నాకు పదహారవయేట అయింది వివాహం. పెళ్లి అయిన రెండుసంవత్స రాలకే నాభార్య కాపురానికి వచ్చింది. నా భార్య చమేలి కొంచం అందం గానే ఉంటుంది. అంతోఇంతో చదువుకున్నదికూడా. లోకోత్తర సౌందర్య వతి కాకపోయినా, హృదయాన్ని సౌందర్యం ఆకర్షించినట్లుగానే - ఆమెలో కూడా ఆకర్షించే లక్షణాలు ఒకటి రెండు ఉన్నాయి. ఏవీ ఆ లక్షణాలు ? హాః అవి జ్ఞాపకంవస్తే ఈనాడుకూడా హృదయంలో బాధగావుంటుంది. నిజానికి ఆ హావభావాలముందర ఏ సహృదయుడైనా అనుపమ సౌంద ర్యాన్ని దిగతుడిచి పారేస్తాడు. ఆ లక్షణాలు - సిగ్గు తొణికిసలాడే ఆమె నేత్రాలు, ఆమె చిరునవ్వే....సిగ్గుతో మిళితమైన చిరునవ్వుతోపాటు ఆమె నేత్రాలును క్రిందికి దించుకోవటం అతిలోకసౌందర్యాన్ని కూడా కాంతి హీనంగా చేస్తూవుండేది. కాపురానికి వచ్చింతర్వాత మూడు నాలుగేళ్ళు ఎంతో సుఖంగా గడిచాయిమాకు. ఈలోపున ఇద్దరు పిల్లలుకూడా కలిగారు.

ఒక కొడుకు, ఒక కూతురూ. ఆ ఆడపిల్లమాత్రం పుట్టిన కొన్ని నెలలకే చచ్చిపోయింది. ఆపిల్ల పుట్టింతర్వాత మా సుఖమయజీవితంమీద మంచు తెర కమ్ముకుంది. ఏవిధంగానూ దుఃఖలేశమయినా లేని మా జీవితాన్ని విధాత కళ్ళారా చూడలేకపోయాడు, పరిణామమేమంటే నా 'చమేలి' రోగగ్రస్తురాలయింది. ఎలాంటి విషఘడియలో ప్రవేశించిందో జబ్బు, అది ప్రాణాల్ని తీసి వదిలింది. అది మనిషిని కృశింప చేసిచేసి చంపేక్షయ రోగం. ఈ రోగంలో మనిషి సంవత్సరాలతరబడి జీవిస్తాడు కాని, ఒక్క క్షణమైనా స్వాస్థ్యంమాత్రం చిక్కదు. చమేలికికూడా యిలాంటిస్థితే ఏర్పడింది.

ఆ వ్యాధి వచ్చింతర్వాత ఆమె ఆరేడు సంవత్సరాలదాకా జీవించే వుంది కాని, ఒక్క నెలయినా ఆరోగ్యం కలగలా. అప్పుడప్పుడు, పైకి ఏమీ జబ్బు వున్నట్లు కన్పించేదికాదు కాని, అప్పుడుకూడా ఆమె ఉదాసీనంగానే వుండేది. ఏ విషయాల్లోకీ మనస్సు చొరబడేదికాదు. ఆమె మీద నుంచి వ్యాధి తన అధికారాన్ని వదలుకోలేదని మాత్రం తోస్తూవుండేది.

ఆమెస్థితినిచూసి నేను ఒక్క సంవత్సరంవరకూ చాలా విచారిస్తూ వుండేవాడిని. వైద్యం - వగైరాకూడా బాగానే చేయించా. కాని తర్వాత మాత్రం నా మనస్సుకి కొంచెం విరక్తి కలిగి, ఆమె భారాన్ని భగవంతుని మీద పారేశాను. ఏదో సామాన్యమైన చికిత్సచేయించటంకన్న విశేష యత్నమేమీ చేయలేదు.

వైద్యులవల్ల, క్షయ అంటువ్యాధి అని తెలిసింది నాకు అంచేత నాకుకూడా ఆవ్యాధి సంక్రమిస్తుందేమో అన్న భయంతో నేను ఆమెదగ్గిర కూర్చోటం, మొదలైనవన్నీ తగ్గించేశాను. అంతేకాక మరోకారణంకూడా ఉంది. కాంతి విహీనమైన ఆమె ముఖం, శుష్కించిపోయిన శరీరం చూసేసరికి నాహృదయంలో దుఃఖంకలిగేది. నిజానికి కొంతవిరక్తికూడా కలిగేది. నా కుటుంబంలో మా అమ్మ ఇంకా ఇద్దరు మరదళ్లూ వుండే వారు. అంచేత ఇంటిపనులన్నీ వాళ్లే చూసుకుపోతూవుండేవారు. నేనే ఆమెదగ్గిర అంటిపెట్టుకుని కూర్చోవలసిన అవసరం లేకపోవటంకూడా ఒక కారణం. అప్పుడప్పుడు పదిపదిహేనురోజులవరకు కూడా మేము మాట్లాడుకోవటం వుండేదికాదు. నా ఈ ఔదాసీన్యం చమేలీకూడా ఎరుగు. కాని ఆ విషయంలో ఎప్పుడూ నాతో ఆమె ఏమీ చెప్పుకుని ఎరగదు.

ఇలా ఒకసంవత్సరం గడిచిపోయింది. ఈ లోపున నా మనస్సంతా మారిపోయింది. ఇప్పుడు ఇంట్లో ఒక్క క్షణం ఉండాలన్నా నాకు కష్టంగా తోచేది. బైట తిరుగుతున్నంతసేపూ మనస్సు ప్రసన్నంగా వుండేది. ఇంటికి వచ్చేసరికి నిరుత్సాహం, ఖేదమూ కలిగేది. అంచేత పగలు రెండు మూడు గంటలకన్నా ఇంట్లో ఎక్కువసేపు వుండేవాణ్ణికాదు. రాత్రిళ్లుపది, పదకొండు గంటలు కానిదే ఇంటికి తిరిగివచ్చేవాణ్ణికాదు. త్రాగుడు మొదలైన దుర్వ్యసనాలూ, దుర్గుణాలుకూడా చాలా అబ్బినాయి నాకు. ఎంచేతంటే నా హృదయమెప్పుడూ ఆనందంకోసం, ఉత్సాహంకోసం, అభిలషిస్తూ వుండేది. ఈ దుర్వ్యసన్నాల్లో నాకు ఆనందం లభించేది.

ఒకరోజున మధ్యాహ్నం కూర్చుని నేనొక నవల చదువుకుంటున్నా. చటుక్కున ఎవరో వస్తున్న చప్పుడువిని తల ఎత్తాను. ఎదురుగా చమేలిని చూసి ఏంచెయ్యాలో తోచక ఇదయాను. నేనెప్పుడూ ఆమెకు దూర దూరంగా ఉండాలనే ప్రయత్నిస్తూ ఉండేవాణ్ణి. నేనెంతో మంచివాడిలాగా, "రా కూర్చో, ఇప్పుడు నీకు వంట్లో ఎలా వుంది చెప్పు." అని అడిగాను చమేలిని. ఆమె నాకు ఎదురుగా కూర్చుని, నిరుత్సాహంగా "ఎలా వుందో, అలాగే ఉంది." అన్నది.

"కనీసం మొదట్లోకన్న కొంచెం కులాసా చిక్కినటుందా? లేకపోతే కొంచెం-----?"

"కులాసా ఏమిటి? ఏదో బ్రతుకుతున్నాను. ఆయుర్దాయం వున్నన్నాళ్లూ, ఇలాగే గడిచిపోతుంది."

నేనేదో చెప్పాలనే ఉద్దేశ్యంతో, "ఆఁ బాగానేవుంది ఇది. ఏంచేస్తాం. ఇన్ని మందులు తిన్నావు, ఇంకా తింటున్నావు. కాని ఇంతవరకు లాభం ఏమీ కనిపించలా." అన్నాను.

చమేలీ నేనన్నమాట వినిపించుకోకుండా, "ఇరవైరోజులకు ఇవాళ మీతో మాట్లాడే అవకాశం లభించింది." అన్నది.

"ఇరవైరోజులా? నిన్ను కలుసుకుంది మొన్న ఈమధ్యనేగా వారం పదిరోజులయి వుంటుంది."

"మీకంటే ఇరవైరోజులూ వారం పదిరోజుల్లా కనిపిస్తున్నాయి కాని నాకుమాత్రం యిరవైరోజులు - ఇరవైరోజులుగానే వున్నాయి."

నేను కొంచెం సిగ్గుపడి, " అయివుండొచ్చు. యిరవైరోజులయిం దేమో ? నువ్వు జబ్బుపడిందగ్గర్నుంచీ, కలుసుకుని మాట్లాడే సుయోగం లభించటంలా" అన్నాను.

" సుయోగంకోసం ప్రయత్నిస్తేగా లభించటానికి..."

నా హృదయం కంపించింది. ఈమాటతో అంతఃకరణ మీద తగి లింది గాయం. చమేలి అన్నమాటలో కొంచెం యథార్థం లేకపోలేదు.

నేను చేతిలోవున్న నవల పేజీలు తిరగవేస్తూ, "అమ్మా వాళ్లూ వుండగా అలాంటివానికోసం ప్రయత్నించటం బాగుండదేమో అని తోచింది." అన్నాను.

ఈ మాట అనటమయితే అన్నాను, కాని అతకనట్లు తోచింది నాకే. అమ్మా, వాళ్లూ ఉన్నప్పటికీ రోజుకు ఎన్నిసార్లు చూడాలనుకుంటే అన్ని సార్లూ చమేలిని కలుసుకొనే సదవకాశం లభించగల అవకాశం ఉంది.

ఈ మాటే చమేలీకూడా అంది. " నేను జబ్బుపడటానికి ముందు నించీ ఉన్నారుగా మీ అమ్మ, మరదళ్లూను!" ఈ మాటకు సమాధానం చెప్పలేకపోయాను. చమేలి కూర్చోటం నాకేం బాగుండలా ఎలాగయినా చమేలీ నాదగ్గిరనుంచి లేచివెళ్ళేందు కేదైనా కారణంకలిగితే బావుండునే అని మనస్సులో భగవంతుని ప్రార్థించాను...ఎలాంటి పరివర్తనం !... ఇదివరలో చమేలీ దర్శనం కోసమని, గదిలోనే, ఏమూలనో వాకుక్కని కాచుకుని ఉండేవాణ్ణి. అలాంటిది ఇవాళ చమేలిదగ్గర కూర్చోటమే ఇదిగావుంది నాకు.

చమేలి కాస్సేపు మెదలకుండా ఊరుకుని, సిగ్గుపడతారెందుకు ? సిగ్గుపడాల్సినంత కారణమేమీ లేదు. ఈమాటకు నేనేం బాధపడను. మిమ్మల్ని నాదగ్గిరకు రప్పించి వివశుల్ని చేసేంత ఆకర్షణ యిప్పుడు నాలో లేదని తెలుసు నాకు" అన్నది.

నేను కొంచెం వికల మనస్కుడనై అన్నాను —

" యివాళ యిదేమిటి నీకు యిలాతోస్తోంది...! అపభ్రంశం మాటలు వస్తున్నాయేం నీనోట్లోంచి ?..."

చమేలి దీర్ఘంగా నిట్టూర్చి, " అపభ్రంశపు మాటలుకాదు, యదార్ధ మైన మాటలే. నాకేం యిదిలేదు. కాని కొంచెం దుఃఖంమాత్రం వుంది.

అందరిమనస్సూ మీ మనస్సులాంటిదే కాదనిమాత్రం జ్ఞాపకం వుంచు కోండి '' అన్నది.

నేను కొంచెం కోప్పడి, '' చూడు చమేలి, నువ్వు యిలాంటి అనవసరం మాటలు మాట్లాడితే నేను లేచి వెళ్లిపోతాను '' అన్నాను.

చమేలి నేత్రాల్లోంచి అశ్రువులు జలజల రాలాయి. యిదివరలో ఈ నేత్రాల్నిచూస్తే నా హృదయం మత్తెక్కిపోయేది. కాని యివాళ అశ్రుపూర్ణ నేత్రాల్ని చూసేసరికి నా హృదయం కరగనైనా కరగలా.

'' మీకీమాటలు నచ్చక పోయేట్లయితే చెప్పను. హాఁ మీరు ఒకమాట ఒప్పుకుంటామని మాటయిస్తే చెబుతాను ''

'' ఏం మాట ? ''

'' ఒప్పుకుంటారా ? ''

'' ఒప్పుకుంటానికి వీలయిన దయితే ''

'' మీరు రెండోపెళ్లి చేసుకోండి ''

నేను ఉలిక్కి పడ్డాను. రెండో పెళ్ళా? అప్రస్తావన చమేలి నోటిమీదగానే తీసుకురావటం .... నేను కొంత సేపటివరకు మెదల కుండా ఊరుకొని '' నువ్వు ఇలా చెబుతున్నా వెంచేత ? '' అని అడిగాను

'' అలా చేసుకోవలసిన అవశ్యకత మీకు ఉంది కనుక చెబు తున్నాను. మీకు సేవచేయగల యోగ్యురాల్ని కాలేకపోయాను నేను. కనుక రెండో పెళ్లి చేసుకోవటమే మంచిది. నాకోసమని మీరు మీజీవితాన్ని దుఃఖభాజన చేసుకోవటం ఎందుకు ? అంచేత నాకుకూడా చాలావిచారంగా వుంది. మీరు నిరుత్సాహంగా వున్నట్లు, విచారంగా వున్నట్లూ చూస్తూన్నాను నేను. అదీగాక మీరు ఏరోజునా రాత్రిళ్లు ఇంటికి రాక పోవడము కూడా చూస్తూనే యున్నాను. మీకు ఇంట్లో ఉండటానికి మన స్కరించటం లేదనీ తెలుసు. ఈ అన్నిటికీ కారణం ఏమిటోకూడా ఎరుగుదును- నేను రాత్రింబవళ్లూ భగవంతుని, నన్ను త్వరగా తీసుకొని పొమ్మని, మీకు వివాహం చేసుకునే స్వతంత్రతరావాలనే --- ప్రార్థిస్తున్నాను. కాని నా ప్రార్థన త్వరలో ఫలిస్తుందనీ కనిపించటంలా. అంచేత మిమ్మల్ని మళ్ళీ పెళ్లి చేసుకోమని కోరుతున్నాను. ''

చమేలి అన్న ఈ మాటలు నన్ను విచారసముద్రంలో విసరివేశాయి అప్పుడప్పుడు మనస్సులో -- ఆరోగ్యవతి కాకపోతే ఎటూచనిపోతుంది.

నాకు మరోపెళ్లి చేసుకునే స్వతంత్రత లభిస్తుంది -- అనే ఆలోచనకూడా కలుగుతూ ఉండేది. ఉఫ్ ఈ ఆలోచన నా మనస్సులోకి ఎలా వచ్చిందో తెలియదు. చమేలికి తలనొప్పి వస్తేనే ఎంతో బాధగాఉండేది ఇదివరలో. అలాంటిది చమేలి మరణాన్నికూడా కాంక్షిస్తున్నా నీనాడు. నిజానికీ ఈ దురాలోచనలకు ప్రాయశ్చిత్తరూపంగానే నేనీనాడు ఇంత ఘోరమైన మానసిక క్లేశాన్ని అనుభవిస్తున్నాను.

"ఉహూఁ నేను చేసుకోను పెళ్లి నువ్వు వుండగా నేనుపెళ్లి చేసుకోవటం ఎన్నడైనా సంభవమేనా ? " అన్నాను నేను.

"నష్టమేముందీ నేనే దీనికి ఒప్పుకుంటున్నప్పుడు, నీవు వెనక్కి తగ్గటం దేనికి ? "

అలాంటి యిచ్ఛలేకపోయినా నానోటినుంచి యదార్థమైన మాటే బైటకు వచ్చింది. "నేను ఒకవేళ పెళ్లిచేసు కోవటానికి ఒప్పుకున్నా, అమ్మా, అన్నగారు ఎలా ఒప్పుకుంటారు ఈ పెళ్ళికి ? " అన్నాను.

"నేను చెప్పి నప్పుడు తప్పకుండా ఒప్పుకుంటారు. ",

"భగవంతుని కోసమైనా నువ్వుయిలా చెయ్యకు. అమ్మగారు నన్నెప్పుడూ మింగదు. నువ్వు ఈ చిక్కులో పడకు. నేను పెళ్లీ గిల్లీ ఏం చేసుకోను "

"నామూలంగా మీరోబాధ పడటం దేనికి ? "

"నాకేం బాధలేదు. విచారం లేదు. నీ జబ్బు మూలంగాను, నీకు కలుగుతున్న కష్టం మూలంగానే నాకు విచారం కలుగుతోంది. మనకీ దు:ఖం ప్రాప్తించటం ఈశ్వరేచ్ఛ . . . . ! "

చమేలీ ఇంకేమీ మాట్లాడలా. కాస్సేపున్నాక ఆమె నాదగ్గరనుంచి లేచి వెళ్ళి పోయింది.

మరో సంవత్సరం గడిచి పోయింది. చమేలీ ఆరోగ్యం అలాగే వుంది. జబ్బు తగ్గినట్లు కనపడదు. జీవితంపూర్తి అయిపోతున్నట్లూ తోచదు. మృత్యువు కోసం ప్రతీక్షిస్తూ ఉండటంతప్ప ప్రపంచములో ఆమెకు మరోపనిలేదు. ఆమెమనస్సుకు ఆహ్లాదాన్ని కలిగించేవస్తు వేదీలేదు ప్రపంచములో కాని ఇంత ఇదిగా ఉన్నా నాసుఖదు:ఖాలమీదనే ఆమెకు లక్ష్యం ఎక్కువగా వుండేది. ఆమెకుఎప్పుడూ నాసుఖదు:ఖాలమీదనేధ్యాన ఆమె నా కెంత దూరదూరంగావున్నా నాసౌఖ్యాన్నిగురించి నేనుప్రసన్నంగా

ఉండటాన్నిగురించే ఆలోచిస్తూ ఉండేది. ఆమెశారీరక సౌంధర్యం నశించి పోయినా, హృదయ సౌందర్యం మాత్రం చెక్కు చెదరలా, పైగా ఆ సౌంధర్యం ఇప్పుడు మరింత అభివృద్ధిఅయింది, నిజానికా పుష్పం ముకుళించుకొని పోయింది. ఎండికూడ పోయింది కాని ఎండిపోయిన వాసన చెడని పొగడపువ్వు అది! దానికి విరుద్ధముగా నాహృదయం ఎంతో కఠిన మైన పరివర్తనపొందింది. నాహృదయభ్రమరం ఆపుష్పంలోనిసుగంధాన్ని లక్ష్యపెట్టటములేదు. కాని భ్రమరానికి సుగంధముతో ఏంసంబంధం? అది కాంక్షించేది కేవల రసాన్ని మాత్రమే. సువాసన ఉన్నప్పటికీ రస విహీనమైన పుష్పం దగ్గరకు పోదు భ్రమరం.

ఒక రోజున ఏదో సామాన్యమైన తప్పుచేశాడని నా కొడుకుని - జ్ఞానూని - కొట్టాను. వాడి వయస్సు ఏడేండ్లు, వాడు ఏడుస్తూ తల్లి దగ్గరకు వెళ్ళాడు. కేవలం ఈ విషయం మీద మర్నాడు చమేలి నన్ను కలుసుకొని "నిన్న మీరుజ్ఞానూని చాలాఇదిగా కొట్టారు." అనిఅడిగింది

"వాడు కొట్టదగినపని చేశాడు."

ఆమె కళ్ళల్లో నీరునింపుకొని "వాడిని కొట్టకండి," అంది.

"ఎంచేత?"

"నాకు చాలా బాధగా వుంటుంది."

ఆమె ఇలా అనే సరికి నాకు కొంచెము నవ్వువచ్చింది. పిల్లల్ని సాధారణంగా అంతా కొడుతూనే ఉంటారు. ఈ మాత్రానికి ఇంతదుఃఖం ఇంత విచారం కలగవలసిన అవశ్యక మేముంది?" తప్పుచేసినప్పుడు కొట్టాల్సిందే. దీనికి నువ్వింత దుఃఖపడటం వృథా!" అన్నాను.

"నేనింత దుఃఖపడటానికి కారణం వుంది."

"ఏమిటది?'

'వాడు తల్లిలేని పిల్లవాడు!,

'వాడు తల్లిలేని పిల్లవాడా?'

"ఆఁ నేనలాగే అనుకుంటున్నాను. నేను జీవిస్తాననే నమక్కం ఎమిటి? నేను చచ్చిపోయినట్లే భావించుకుంటున్నా కనుక వాడు మాతృహీను డంటున్నాను. వాడ్ని ఎవరన్నా ఏమయినా అన్నా మీరు ఎప్పుడైనా కొట్టినా, వచ్చి వాడు నన్ను కౌగలించు కొంటాడు. నేను వాడ్ని నాహృదయానికి హత్తుకుని ముద్దెట్టుకుని బుజ్జగించి లాలిస్తుంటాను

మరి నేను చన్చిపోయాక వాడెవరి ధగ్గరకు వెడతాడు? వాడి కన్నీళ్ళు పమిటచెంగుతో ఎవరు తుడుస్తారు? ప్రేమతో ఎవరు వాడి ఏడుపు మాని పిస్తారు? అంచేత వాడ్ని మీరేమీ అనవద్దు అంటున్నాను."

జాలి కలిగించే ఈ చమేలి ప్రార్ధనతో నాహృదయం కాస్సేపు కంపించింది. ఆమె మాటల్లో ఎంత ప్రబలశక్తి వుందేమని. నా పాషా ణహృదయానికి కూడా అఘూతాన్ని కలిగించాయి అవి. "సరే ఇహ నెప్పుడూ వాడ్ని ఏమీ అనను." అన్నాను.

చమేలికి అంత్య సమయం దగ్గరలోనేవుంచి. ఆమె మంచం పట్టి నెల్లాళ్ళయింది. అప్పటినుంచి ఆమె పరిస్థితి ఆరోజుకారోజు క్షీణించు కొంటూ వచ్చింది. ఆమె ఇహ ఆరాత్రి శాశ్వతంగా ఈ ప్రపంచాన్ని వదలిపోతుందనగా, ఆమధ్యాహ్నం నన్ను తన దగ్గరకు పిలిపించుకుంది. నేను దగ్గరకు వెళ్ళా. ఆమె ఈ లోకంలో ఇహ కొద్ది రోజులపాటు వుండే అతిథేనని నాకుతెలుసు కాని ఆదినమే ఆమెకంత్యదినమని మాత్రం కలలో కూడా అనుకోలా. నేను ఆమె దగ్గిరకూర్చుని, 'ఇప్పు డెలావుంది నీకు?' అని అడిగాను'

చమేలీ చిరునవ్వునవ్వి 'ఇప్పుడు చాలా బాగుంది' అన్నది.

', చాలా బాగుండట మేమిటి ?"

"నామనస్సు ఇప్పుడున్నంత ప్రసన్నంగా ఎన్నడూలేదు."

"ఇవి నువ్వు అంటున్న మాటలేనా ?"

"లేదు నేను నిజమే చెబుతున్నా."

"నేను శ్రద్ధగా చమేలీ ముఖాన్ని పరిశీలించాను ఆరుసంవత్సరాలు గడిచాక ఈనాడు ఆమె ముఖంలో ఆరు సంవత్సరాల క్రితం ఉన్న ఆ చిరునవ్వును ఆ సౌంధర్యాన్ని చూడకలిగాను. ఆమెకిహ జబ్బేమిలేదు. బాగా ఆరోగ్యం చిక్కిందనుకున్నాను. అనాడుమళ్లీ ఆమెమీద మొదట్లో నాకు ఉండేప్రేమ ఎలా కలిగిందో ఎరుగను. అరుసంవత్సరాలకునేను మళ్లీ ఎంతో ప్రేమతో ఆమెశిరస్సు నిమురుతూ, "నీ ఆరోగ్యం యిలానే ఉంటే, ఇహ నాలుగురోజులలో పూర్తిగా ఆరోగ్యాన్ని పొందుతావు." అన్నాను.

నాప్రేమ పూర్వకమైన మాటలువిని, చిరునవ్వుతోపాటూ కొంచెం సిగ్గుపడి, ఆమెదృష్టి మరోవైపుకు తిప్పుకుంది. నాహృదయం వికల

మయింది. ఆలజ్జ దృష్టే! ఆ చిరునవ్వే! - చమేలీ సౌందర్యంలో లోప మేమీ రాలేదు. ఈ మాత్రం కనిపెట్టలేక పోవటానికి నేనిన్నాళ్లనుంచి అంధుణ్ణయినానా? నేను ఈమె అంటే ఇంత ఉదాసీనంగా ఉండి, ఎంత ఘోరమైన అనర్థం చేశాను? ఇన్నాళ్ళు ఈమెను దురుద్దేశ్యముతో ఎందుకు వదిలివేశాను? ఈమెను అసహ్యించుకోవటం వలన ఈమెలో ఎలాంటి చెడు పరివర్తన కలిగించింది? ఈ అమూల్యరత్నాన్ని జారవిడుచుకుని, నే నా యినపముక్కలతో ఎలా అనుభవించాను ఆనందాన్ని? ఇంచేతే ఈమె రోగగ్రస్తురాలయిందేమో? ఛీ! ఛీ! ఎంత పశుత్వం! నే నింతవరకు అలాగే ప్రవర్తిస్తున్నా కనుక ఈమె ఎన్నడూ ఒక్కనాడైనా రోగవిముక్త రాలు కాలేకపోయింది. ఈ వ్యాధిపీడితను ఇన్ని కష్టాలో వదిలేసి' నేను కేవలం నాకోసం, నా ఆనందకోసం, నా సౌఖ్యంకోసం అన్వేషించు కుంటూ ఎలా తిరిగాను? ఈమె కేవలం దుఃఖితురాలై నట్లయితే నాకు కూడా దుఃఖాన్ని ఆపాదింపచేయాలని వాంఛించి ఉండేది. కాదుకనుకనే ఈమెనిలాంటి దశలో వదిలేసి ఒంటరిగా సుఖాన్ని అనుభవించటం! ఎంత అనర్థం జరిగింది! ఈ విషయాలన్ని తెలుసుకుని ఉన్నప్పటికీ ఈమె ఎన్నడూ 'కంప్లయింట్' చేసి ఎరుగదు. పైగా అందుకు విరుద్ధంగా నేను సుఖంగా ఉండటానికీ, ప్రసన్నంగా ఉండటానికీ అనువైన ఆలోచనలు చేస్తూ ఉండేది. ఆమె సుఖకల్పనలు ఎంతవరకంటే నాకు రెండో వివాహం చేయాలనికూడా ప్రయత్నించింది. ఆమె ప్రవర్తనకూ, నాకూ ఆకాశ పాతాళాలంత వ్యత్యాసం ఉంది. అని నాలో నేను అనుకోసాగాను. నేను చాలా పాపం చేశాను. ఈ పాపన్నుంచి ఎలా విముక్తుణ్ణవటమో తెలియకుండా వుంది.

నేను ఆలోచన సముద్రంలో మునిగి ఉండటం చూసి "ఏమిటి ఆలోచిస్తున్నావు?" అని అడిగింది చమేలీ.

"ఏం లేదు."

"మీతో కొంచెం మాట్లాడాలని పిలిపించాను మిమ్మల్ని'

"చెప్పు ఏం మాట్లాడాలనుకున్నావ్?"

"నా మూలంగా మీకు చాలా కష్టం ప్రాప్తించింది. మీ సుఖమార్గానికి నేను కంటకమైనాను విధాతనా అదృష్టంలో సుఖాన్ని వ్రాయపెట్టలేదు. వ్రాసిందేమో అనుభవించాను, అనుభవించింది స్వప్నంలో వైకుంఠాన్ని

చూచినట్లుఉంది. నేను మీసుఖాన్ని నాశనం చేసే కారకురాలినిగానే ఉండి పోయాను. ఈనాడు మీసుఖమయమార్గాన్నుంచి తొలగిపోతున్నాననితెలుసు కుంటే ఎంతోసంతోషంగా ఉందినాకు. ఇహమీరు ప్రపంచలో సుఖోపభోగా లను అనుభవించడానికి స్వతంత్రులు.........

ఇంకేమీ వినలేకపోయాను నేను. "ఇదేమిటిలా వాగుతున్నావు చమేలి? నువ్వులేకపోతే నాకు స్వర్గంలోనైనానరే,, సుఖంలభించదు. భగవంతుడు కలిగించలేడు.....

చమేలి కొంచెం ఆశ్చర్యచకితురాలై "ఇహ చూపించటానికింక సమయంలేదు. ఈకపటవేషాన్ని వదిలేసి, నేనుచెప్పేదివినండి.,,

నేను దుఃఖితుడనై నేను చాలా అధముణ్ణి, నీచుణ్ణి, చమేలి! నేను గతంక్రితంవరకు కపటవేషాన్ని ధరించి ఉన్నాననటంలో సందేహ మేమీ లేదు. కాని ఈశ్వరుడెసాక్షి. ఇంతకుపూర్వంవరకు శుష్కప్రలాపన చేసి నందుకు సిగ్గుపడుతున్నాను. నేను చేసినదానికి ప్రాయశ్చిత్తంగా ప్రాణా ల్నిచ్చిచేయగలిగిన దేదయినా ఉంటే చేయటానికీ సిద్ధంగా ఉన్నాను. నేను గ్రుడ్డివాణ్ణి అయిపోయాను' నేనెలాఇదయిపోయానో తెలియదు నాకు నీవిషయమై నేనింతదుష్టంగా ఎలాప్రవర్తించానో, నాకేవిశ్వాసం గలగ కుండా ఉంది" అన్నాను. ఇలా అంటూఉండగానే ఎక్కిళ్లువచ్చాయి. నాకళ్ళనుంచి అశ్రువులు ప్రవహించ సాగినాయి నాకు. చమేలి కళ్లనుంచి కూడా కన్నీరుచొరలసాగింది.

కాస్సేపయాక, "మీరీమాట కొన్నాళ్లక్రితంచెప్పినట్లైతే, ఒకవేళ నేను జీవించటానికి ప్రయత్నంచేసిఉండే దాన్ని. కాని ఇహ యిప్పుడేంలాభం లేదు." అన్నది చమేలి.

నేను ఉలిక్కిపడ్డాను. నాకళ్లకు అంధకారం క్రమ్మనాగింది. చమేలి శిరస్సును నావడిలో పెట్టుకుని, "కాదు. ఇలాకావడానికి వీల్లేదు. నాపొరపాటుకు నేను పశ్చాత్తాపంపడుతున్నప్పుడు, ఆపొరపాటుకు ప్రాయ శ్చిత్తం చేసుకోవడానికి సంసిద్ధుడనై వున్నప్పుడు, ప్రపంచములో ఉన్న సర్వవస్తువులకన్న నాకు నువ్వు ప్రియతమురాలవైయుండి, నన్నిప్పుడు ఇలా విడిచిపెట్టి పోవాలని వాంఛిస్తున్నావా? వద్దు చమేలీ! అలాఎప్పుడూ జరగటానికి వీల్లేదు.,, అన్నాను.

"మీ ఈమాటలన్నీ వింటూంటే నాకు మృత్యువంటే చాలాభయం ఏర్పడుతోంది. హృదయంలో జీవించాలని ఉత్కటవాంఛ కలుగుతోంది.

ఇంతవరకూ సంతోషపూర్వకంగా చనిపోవటానికి సిద్ధంగా వున్ననాకు, ఇప్పుడు మీమాటలు వింటూవుంటే మృత్యువంటే ఎంతో దుఃఖదాయిగా కనిపిస్తోంది. నా అంత్యసమయాన్ని దుఃఖప్రదంగా చేయకండి. యింత దుఃఖంతో చనిపోవాలంటే నా కేంతో కష్టంగావుంటుంది. నేను నిన్ను అసహ్యించుకుంటున్నానవే చెప్పండి మీరు. నేనంటే ఆ వుదాసీనభావాన్నే వుంచండి. నేను సంతోషపూర్వకంగా, చనిపోవటానికి, నాకు మృత్యువంటే భయంకలగకుండా వుండటానికి, నేను చనిపోయినతర్వాత మీకు సుఖ సంతోషాలు కలుగుతాయనే విశ్వాసాన్నికలిగించండి నాకు''అన్నది.

దుఃఖంతో, పశ్చాత్తాపంతో నాకంఠం రుద్ధమైపోయింది. ఆమె మాటలకు నేనేంసమాధానం ఇవ్వలేకపోయాను. ‘‘మిమ్మల్ని ఈసమయంలో ఒక్క భిక్షమాత్రం అర్థిస్తున్నాను.'' అన్నది చమేలీ,

నేను చాలా కఠినంగా ‘‘ఏమిటి''అన్నాను. ‘‘నా జ్ఞానుసుమాత్రం ఏప్పుడూ ఏమీ అనకండి'' అని చమేలి స్మృతితప్పివడిపోయింది. మళ్లీ అంతిమశ్వాస వదిలేవరకు ఆమెకు స్మృతి రాలేదు.



# శాంతి

రావుసాహెబ్ రామచంద్రదత్తుకి ప్రౌఢ వయస్సుచెల్లి, వృద్ధాప్యం మీద పడేసరికి ఆయనస్వభావం కొంచం ముక్కోపితనంగా పరిణమించింది. సర్వవిధాలైన సాంసారిక సుఖాలన్నీ వున్నప్పటికి, మనస్సుకు శాంతిలేక పోవటమే ఆముక్కోపి తనానికికారణం. మానవహృదయం శాంతి ప్రియమైనది. అదెప్పుడూశాంతితృష్ణతో వ్యాకులపడుతూవుంటుంది. దత్తు మహాశయుడికి ఏవిషయాల్లోనూ అభావమనేదిలేదు. ధనానికితక్కువ లేదు. చక్కని కుటుంబం. కొడుకులూ, కూతుళ్లు, మనుమలూ, మనమరాళ్లూ అంతావున్నారు-లేని వల్లామనస్సుకు శాంతి ఒక్కటే...

దత్తుమహాశయుడు ఒక రోజున మనస్సుకు శాంతి ఎలా లభిస్తుందా అని ఆలోచిస్తూ కూర్చున్నాడు. తన గతజీవితాన్ని తలపోసుకుంటూ- నేనొక లక్షాధికారినయితే నాజీవితం శాంతి ప్రదంగా గడుస్తుందిగదా అనుకున్నానొకప్పుడు. ఎందుకంటె ఇంక నాకేవిధమైన అభావమూవుండదు. ఏవిధమైన అభావమూలేకపోవటమే, శాంతి సుఖాలని అనుకున్నాను. ఈశ్వరుడాధనాన్ని సమకూర్చి, నన్నులక్షాధికారిని చేసి నాకోరిక నెరవేర్చే సరికి, నా కేదయినా ఒక గౌరవబిరుదం లభిస్తేచాలు, ఇంకేమి అవసరం లేదు. నాకోరికలన్నీఫలించినట్లే అవుతాయి. నా అంత్యజీవితాన్ని సుఖంగా గడపగలననుకున్నాను. ఈఅభిలాషకూడా భగవంతుడు ఫలింపచేశాడు. నాకు రావుసాహెబ్ అనే గౌరవపదవం లభించింది. తర్వాతయినా నా హృదయంలోని ఆరాటంతగ్గి నాకు శాంతి లభించలా! ఒక వాంఛ తీరేసరికి మరొకటి వుత్పన్నమయేది. ఒకప్పుడు పుత్రులుకావాలని కోరిక. ఆకోరిక నెరవేరేసరికి పౌత్రులను చూచుకోవాలనివాంఛ. అంతామిధ్య. సాంసారిక సుఖాల్లోనే శాంతివుందని తన వాంఛలు సాఫల్యమవటంలోనే శాంతిలభిస్తుందని అంటారులోకులు. కాని నిజానికి శాంతిఎందులోనులేదు. శాంతిఅనేదికనుక వుంటే, సంసారాన్నిత్యజించి, సన్యాసిఅవడంలోనేవుంది శాంతి. అలాకాకపోతే, పెద్దపెద్ద యోగీశ్వరులు, జ్ఞానులు సంసారాన్నివదలి సన్యాసాశ్రమాన్ని ఎందుకుస్వీకరిస్తున్నారు? అంతే. ఈ సంసారాన్నీ

త్యజించటంలోనే మనస్సుకు విశ్రాంతిలభిస్తుంది'' అనుకున్నాడు రావు సాహెబ్. ఈఆలోచనల్లో మునిగి తేలుతుండగా, ఆయనపెద్దకొడుకు కృష్ణ దత్తు తలుపుతెరచుకొని గదిలోకివచ్చాడు. రావుసాహెబ్ వులిక్కిపడి ''ఏమిటిరాకృష్ణా!'' అని అడిగాడు.

కృష్ణదత్తు కొంచంకోపంగా వున్నాడు. తండ్రిఇలా అనగానే అతడు కర్కశస్వరంతో,'' ఏముంది? తనే అధికారం చలాయించా లని వుంది వాడికి. ఇవాళచాలా అవసరమైన పనిమీద వెళ్లాలినేను. కారుఇవ్వాళ ఎక్కడికీపంపద్దని కబురుచేశాను. కాని వాడికి ఈమాటఅంటేఏంలెఖ్క? ఎవరిపని అయినా చెడిపోతే వాడికేం?''

''అయితే చివరికి వాడేంచేశాడు?''

''ఏంచేశాడు? కారుతీసుకొని ఎక్కడికోవెళ్లి పోయాడు. అక్కడకీ-పెద్దబాబుగారు తమపనికోసమని కారువుంచమన్నారు-అని డ్రైవరుఅన్వర్ ఖాఁ చెప్పనుకూడాచెప్పాడు. కానివాడు లక్ష్యపెట్టలేదు. వాడ్నికూడారెండు తిట్టాడు. ఎటూనౌకరు నౌకరేగా! వాడే కారుతీసుకుని వెళ్లాల్సి వచ్చింది.

రావుసాహెబ్ నిదానంగా' ''పోనీ, తీసుకునివెళ్లాడుగా! నువ్వురెండు గుర్రాలబగ్గినితీసుకువెళ్లు. లేదా నీ గుర్రమెక్కి వెళ్లు'' అన్నాడు.

''రెండుగుర్రాల బగ్గీతీసుకొని వెళ్లమని, గుర్రాన్ని ఎక్కి వెళ్లమని మీరూ అనేశారు. మీ రిలా అంటూ ఉంటేనే వాడికి సాహసంజాస్తి అవు తోంది. నాన్నగారేమీ అనరని వాడికితెలుసు. ఎలాతోస్తే అలాచెయ్యండి.''

''అయితే ఇంతకీ ఏంకావాలంటావ్?''

''నాకోసం మరోకారుతెప్పించిఇవ్వండి అంటాను. గుర్రంకాని, బగ్గీ కాని నాకుబాగుండవు. కారుమీద అధికారం చిన్నవాడిది. సగం అధికారం నాకిష్టంలేదు. నేను చాలా చూచీచూడనట్లు పోతున్నాను. లేకపోతే రోజూ పోట్లాడవలసివచ్చేది.''

''సరే. నేను వాడికిచెప్పిచూస్తాను. వాడు కనుక వినకపోతే నీకు మరోకారు తెప్పించియిస్తాను.''

కృష్ణదత్తు వెళ్లిపోయింతర్వాత రావుసాహెబ్ నిట్టూర్చి—ఒక్క క్షణమయినా ఏకాంతంగా ప్రశాంతంగా కూర్చునే స్వతంత్రమైనా లేదు నాకు. ఉఫ్! నేను ఈ జంజాటంతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నాను - అనుకున్నాడు.

కృష్ణదత్తు వెళ్లిపోయాడు. యింతలో ఆగదికీ అంతఃపురంవైపున ఉన్న ద్వారంతెరచుకుని, సంపూర్ణయౌవ్వనవతులిద్దరు లోపలికి వచ్చారు. వాళ్లల్లో వాళ్లు ఏదోమాట్లాడుకొంటూ వచ్చారు.'' ఏమయినాకానీ, నేను యివాళే నాన్నగారితో చెప్పిచేయించుకుంటాను'' అంటున్న దొకతె.

''నువ్వుచేయించుకొంటే నేనేనాచేయించుకోంది ?''అన్నదిమరొకతె

రావుసాహెబ్ వెనక్కితిరిగి చూచేలోపుగా వాళ్లిద్దరూ దగ్గరకువచ్చేశారు. ఆయనముఖంమీదికి చిరునవ్వుతెచ్చుకొని, ''ఏమిటి కృష్ణా ! చేయించు కోవాలంటున్నావ్ ? '' అన్నాడు.

''నేను ఇవ్వాళ శ్యామచరణ బాబుగారింటికి వెళ్లాను నాన్నగారూ ! శామచరణరాయిగారి కూతురు సుభద్రకు ఇవ్వాళ రత్నాలగాజులు చేయించి తెప్పించారు. ఏంచెప్పను నాన్నగారూ ! అంతఅందమైనగాజులు నేనెప్పుడూచూడలా. నాకుకూడా ఒకజత చేయించండి నాన్నగారూ ! '' అన్నది కృష్ణ.

''నాకుకూడా. . . ,, అన్నది రెండో అమ్మాయి.

''నీకు రెండుమూడు జతలు గాజులు ఉండనేఉన్నాయిగా ! ఇంకా చేయించుకొని ఏంచేస్తావ్ ? వాటినితొడుక్కోటానికే నీకువీలుచిక్కటంలా.

''ఉన్నా, అలాలేవు. నాన్నగారూ ! నాకలాంటివే చేయించండి,,,

''సరే. ముందువాటినిచూడనీ. నమూనాలేనిదే ఎలాచేయించటం?''

''నమూనా దొరకటం ఏమంత బ్రహ్మండం? వారిదగ్గిరకు మనిషిని పంపండి.''

''సరే! చూస్తా.''

''కాదు ఇప్పుడే తెప్పించండి. మళ్లీ మీరుమరచిపోతారు.,,

రావుసాహెబ్ అసలిప్పుడు ఏకాంతముగా కూర్చుందామని అభిలషించాడు. కాని, పిల్లలువచ్చిఇలాచెయ్యటంమూలాన ఆయనవెళ్లి గాజులు చేయించే ఏర్పాట్లు చేయించవలసి వచ్చినది.

●

''సంసారంకంటె— విశేషించి ఏవిధమైన అభావమూలేని ఇలాంటి సంసారంకంటె - సుఖదాయకమైనది మరొకటిలేదు. కాని నాకుమాత్రం సుఖానికి బదులు ఎక్కువ దుఃఖమే కలుగుతోంది. ఎప్పుడూఇంట్లో ఏవో పోట్లాటజరుగుతూనే ఉంటుంది. వీళ్లకోరికలతో నాకు విసుగెత్తి పోతోంది. విరక్తి కలుగుతోంది. ఎస్టేట్ విషయాలు మరొకవంక వేధిస్తున్నాయి.

ఒంటరిగా నేనొక్కడ్నీ ఎన్నని చూడను? ఎన్నని చేయను? ఇంట్లోపరిస్థితి చూస్తే ఒకళ్లకి, ఒకళ్లకి పడకుండా ఉంది. ఒకరికేదయిన చెప్పానా అంటే మరొకరికి కష్టంతోస్తూఉంటుంది. ఇహ వ్యాధులంటావా, అవిమాఇంట్లోనే మకాంపెట్టేశాయి. ఒకళ్లకి జ్వరంవస్తే, మరొకరిజలుబుచేయటం. ఒకరికి నయమైందీ అంటే మరొకరు పడకవేస్తూఉంటారు. ఇంతకీ చెప్పవచ్చిం దేమిటంటే ఒక్కక్షణమైనా దిగులులేకుండా వుండలేక పోతున్నాను. అన్నీవున్నా రోజూ ఒక్క అరగంటైనా ప్రశాంతంగాగడపలేకపోతున్నాను. ఇలాంటి స్థితిలో నన్నేమిచెయ్యమంటావు చెప్పు,'' అని రామచంద్రదత్తు గారు తనస్నేహితుడు శ్యామచరణబాబుతో చెప్పుకోవటం ప్రారంభించాడు.

రావుసాహెబ్ శ్యామాచరణబాబు చిరునవ్వు నవ్వి, ''సంసారంలో వుండే సుఖం ఇదేభాయీ! దీన్ని దుఃఖంగా భావించటం నా ఉద్దేశ్యం ప్రకారం చాలా పొరపాటు.'' అన్నాడు.

''అయిఉండవచ్చు. కొంతమందికి ఇందులోనే సుఖంకనిపిస్తుంది. కాని నాకిది చాలా దుఃఖంగా కనిపిస్తోంది భాయీ!''

''అయితే ఏమంటారు మీరు?'

''ఈ దిగుళ్లనుంచి విముక్తిపొందాలనీ నాఅంత్యకాలమంతా ఈశ్వర భజనతో శాంతిపూర్వకంగా గడపాలనీ వాంఛిస్తున్నాను.''

ఇలా అనేసరికి శ్యామాచరణబాబు ఫక్కుననవ్వి, ''మోక్షాన్ని పొందటాని కాయత్తమౌతున్నానని చెప్పండి'' అన్నాడు.

రామచంద్రబాబు గంభీరంగా, ''ఇది నవ్వవలసిన సంగతికాదు. మోక్షానికాయత్తమవటమనేది చాలా కఠినమైన విషయం. నామనస్సుకు శాంతియేర్పడాలనే నేను వాంఛిస్తున్నది'' అన్నాడు.

''మనస్సుకు శాంతి లభించటమనేది మనుష్యుల స్వభావాన్నిబట్టి ఉంటుంది. ఎన్నిచిక్కుల్లో చిక్కుకుని ఉన్నా కొంతమంది అశాంతిగా ఉన్నదనే అనుకోరు కొందరు మీలాంటివారూ ఉంటారు. వాళ్లకీఎప్పుడూ ఎలాంటిపరిస్థితుల్లోనూ శాంతి అనేదివుండదు.''

శ్యామాచరణబాబు మాటలు రామచంద్రబాబుకు అంతగా నచ్చ లేదు.'' అశాంతిలేదనుకునే వాళ్లు వుంటేఉండవచ్చు. కాని నాకుమాత్రం అలాంటి వాళ్లింతవరకూ ఎక్కడా కనిపించలా'' అన్నాడు.

''అలాంటివారిలో నేనొకడ్ని, మీకుప్రత్యక్షంగా కనిపిస్తున్నానుగా.''

అన్నాడు శ్యామాచరణబాబు - రామచంద్రదత్తు మృదుహాస్యంచేసి. "ఇప్పుడు నీపరిస్థితిఎంత? నువ్వింకా సాంసారిక సుఖాన్నిఎంతోచవిచూడ వలసియున్నది, నీహృదయంలో ఎన్నో అభిలాషలు, ఎన్నో భావతరంగాలు ఇంకా నిండుగావున్నాయి. కనుక నువ్వుచెప్పుకోవలసినదేమీ లేదు. నువ్వు కూడా నేనున్న ఇలాంటి అవస్థలోకివచ్చి, శాంతికోసమై అన్వేషించకపోతే అప్పుడనుకుంటాను నువ్విలాంటి ప్రకృతి కలవాడివేనని'' అన్నాడు.

"సరే. మరి మీరేదయినా వుపాయాన్ని అన్వేషించారేమోచెప్పండి''

"ఆలోచించినదిదే. సన్యాసంస్వీకరిస్తాను''

శ్యామాచరణబాబు కళ్లుయింత చేసుకొని, "సన్యాసమా? ఏమి టంటున్నారు మీరు?'' అన్నాడు.

నాహృదయంలో యధార్థంగా వున్న ఆకాంక్ష ఏదో, అదేచెప్పాను నీతో...''

"అది కాదండీ, ఇదేమంత గొప్పవిషయం? సన్యాసంపుచ్చుకోవల సినంత అవసరంమీకేముంది?''

"అయితేఏంచెయ్యను మరి?''

శామాచరణబాబు రెండునిముషాలు ఆలోచించి, మీరుకొన్నాళ్లపాటు- అంటే నాలుగయిదునెలలు - మీ జమీంపారీ పరగణాలో ఏపల్లెటూరి కయినా వెళ్లి వుంటేబావుంటుందని నా వుద్దేశ్యం, అక్కడ వుండటంవల్ల మీ అశాంతి అంతా తొలగిపోతుంది'' అన్నాడు

"నేనక్కడికి వెడితే ఇక్కడవ్యవహారలన్నీ ఎవరుచూస్తారు?''

"మరి సన్యాసంపుచ్చుకుంటే అప్పుడెవరుచూస్తారు?''

"అప్పుడెవరైనా చూడనీ, చూడకపోనీ నాకెందుకు?''

"సాంసారిక బంధనాన్నే త్రెంచేసుకున్నపుడు, దానికోసం ఆలోచించ వలసి నంత అవశ్యకత ఏముంది? నాలుగయిదునెలల భాగ్యానికి గుమాస్తాలయినా, వీటన్నిటిని చూడగలరు. కనీసం నేను చెప్పు తున్నందుకయినా మీ రిలా చేసిచూడండి. ఇందులో మీకు ప్రయో జనంకనుక లేకపోతే, ఏలావుచితమనితోస్తే అలాచెయ్యండి. మీరు వెడితే, మీతోపాటు నేనుకూడావచ్చి, మీరు వున్ననాళ్లూ నేనుకూడా అక్కడే వుంటా.''

"సరే. ఇదే బాగుంది. ఇలాచేసిచూద్దాం.'

సాంయంత్రం అయిదుగంటలైంది. లక్ష్మణపురంలోని వ్యావసాయకులు పగలల్లా పొలాల్లో పనులుచేసుకుని, ఇళ్లకుతిరిగిరావడానికి బయలుదేరుతున్నారు. ఈసమయములోనే రామచంద్రదత్తు శ్యామాచరణబాబులు వాహ్యాళికి బయలుదేరారు. ఇద్దరూ ఏ దో మాట్లాడుకుంటూ, చల్లగాలిని సేవిస్తూ మెల్లిగా త్రోవను ఒకవైపునించి నడుస్తున్నారు. "ఆనందం పల్లెటూళ్లల్లోనేవుంది. కాని అందులో శతాంశమయినా పట్టణాల్లో లేదనటంలో అవంతయినా సందేహంలేదు భాయీ! చూడు ఎంతటి సుందరదృశ్యాలో! నాలుగువైపులా చక్కని పచ్చటి చేలు. అస్తమిస్తున్న సూర్యకిరణాలు ఈ పచ్చని చేలమీద పడితే ఎంతశోభస్కరంగాఉంది? గాలికూడా ఎంత చల్లగా, మందంగాఉన్నది!" అన్నాడు రామచంద్రదత్తు.

"ఈ ఆనందం పట్టణాల్లో ఎక్కడుంది? అక్కడ ఉండే, తోటల్లో పార్కుల్లోకూడా కృత్రిమత్వంనిండి ఉంటుంది. ఇక్కడ ఆడంబరమనేదిలేదు. ఉన్నదంతా ప్రకృతిసౌందర్యమే. చూడండి, ఎదురుగానున్న ఆ ఎండిపోయినచెట్టు! దీనికి ఆకు అన్నమాటలేదు. అయినప్పటికీ ఈ పచ్చటి చెట్లనడుమ అది ఎంతబాగున్నట్లుందో చూడండి. ఇదితన సొబగును విడిగానిలబెట్టుకుంది. ఇక్కడుండే ఎండిపోయిన గడ్డిపోచలు ఎండిపోయిన చెట్లుకూడా తమసౌందర్యాన్ని ప్రత్యేకంగానిలబెట్టుకుంటాయి."

"నిస్సందేహంగా. ఈ రైతుల్ని చూడండి, ఎంత సంతోషంగా ఉన్నారో! పగలెల్లాకృషిచేసి అలసిపోయినా పాటలు పాడుకుంటూ వెడుతున్నారు. కాని వీళ్లల్లో దరిద్రంమాత్రం మహాఉంది భాయి!"

"దరిద్రంలేకపోతే మరేంఉంటుంది? ఈఅమాయకులు సంవత్సరం పొడుగునా ఎంత పండించినా కొంత పన్నుకు, కొంత జమీందార్ల నజరానాలకు, కొంతకరణాల ముడుపులకు, కొంత మిలటరీవాళ్లబెదరింపులకు, తీరిపోతుంది, మిగిలిన కాస్తదాంతో కడుపునిండుటమే కష్టంగాఉంటుంది. ఇలాంటి పరిస్థితుల్లో వాళ్లల్లో దరిద్రం తాండవించక మరేంఉంటుంది? అంతే కాకుండా తమ భూమిని ఎక్కువ ఫలవంతం చెయ్యాలనే కాంక్ష కూడా ఉండదు వారికి. అయినా ఏవిశ్వాసంతో చేస్తారు? ఇరవైనాలుగు గంటలూ జప్తు చేస్తారేమోననేభయమే. వీళ్లు శ్రమపడి కొంచం వృద్ధి చేసినా, తమ ప్రతినిధులు ఏకారణం కల్పించి అయినా జప్తు చేశారంటే, ఈ అమాకుల శ్రమఅంతా మట్టిపాలైపోతుంది."

9

"అవును. నిజమే అది. అలా పోదాంపద. అచెట్లక్రిందికి పోయి కొంచంసేపు అక్కడ కూర్చుందాం."

ఇద్దరూ అక్కడకివెళ్లి ఒకరాయిమీద కూర్చున్నారు. దానికి నాలుగు వైపులా చెట్లుగుబురుగా ఉన్నాయి.

"మనం ఇక్కడకువచ్చి పదిహేను, ఇరవైరోజులయింది. ఇన్నాళ్లల్లో మీకు కొంచెమయినా శాంతి చిక్కిందా చెప్పండి."

రామచంద్రబాబు కొంచెంసేపు ఆలోచనలోపడి," కొంత సుఖం లభించిన మాటవాస్తవమే. కాని ఇదివాస్తవికమైన శాంతి కాదు. మనస్సు కొంచం ఉద్విగ్నమవుతోంది." అన్నాడు.

"పోనీండి. మనంవచ్చిమాత్రం ఎన్నాళ్లయింది? మెల్లిమెల్లిగా మీకు శాంతికూడా లభిస్తుంది."

"బహుశా అలాజరగటం సంభవమే. కాని నాకుమాత్రం ఆ ఆశ కన్పించటంలా. ఈవిధంగా శాంతి లభించదని నాహృదయంచెబుతోంది.

"మీరు మిమ్మల్ని నిరాశావాదిగా భావిస్తున్నారా ?"

"నాలాంటి పరిస్థితి నీకూ సంభవిస్తే నువ్వూ నిరాశావాదివే అవుతావు."

"అయితే ఇలా శాంతి లభించదని మీకు అనిపిస్తోందన్నమాట !"

"అదే నావిచారం."

"ఇలా లభించకపోతే మరి ఎలా లభిస్తుంది?"

"అలాగే... నేను చెప్పిన పద్ధతిని బట్టి."

"అంటే. . . ? "

"సంసారాన్ని త్యజించి సన్యాసాశ్రమం స్వీకరించటంవల్ల..."

రామచంద్రదత్తు నోటినుంచి ఈ మాటబైటికి వస్తుండగానే ఒక వైపునించి పెద్దనవ్వు వినిపించింది. ఉలిక్కిపడ్డారిద్దరూ. పరస్పరం ముఖముఖాలు చూచుకున్నారు.

"ఈనవ్వు ఎక్కడనుంచీ వినిపించింది ?" అని అడిగాడు దత్తు.

"ఇక్కడే ఎక్కడనుంచో వినిపించింది."

"నవ్వినవాని కంఠస్వరంకూడా చాలాగంభీరంగాఉన్నట్లుతోస్తుంది.

"ఇక్కడ పాలాలైనాలేవు, అంతాఅడివి."

"ఆ కంఠస్వరాన్నిబట్టి అతడొక గ్రామీణుడనితేచదు." సరీగ్గా ఈ

సమయానికే ఎదురుగా ఒక వృద్ధుడు వస్తున్నట్లు కనిపించింది. అతడి వేషాన్నిబట్టి చూస్తే అతడొక భిక్షుకుడిలాఉన్నాడు.

శ్యామాచరణబాబు మెల్లిగా... "ఓ అవును. ఈ అడివిలో కొన్నాళ్ల నుంచీ ఒక వృద్ధ భిక్షుకుడుంటున్నాడనీ, అతడెప్పుడూ అక్కడే ఉంటూ రోజూ ఒకసారి మాత్రం ఊళ్లోకి వస్తాడనీ, ఏడెనిమిది రోజుల క్రితం ఈ ఊళ్లోవాళ్లు ఒకరిద్దరు చెప్పారు." అని మెదలకుండా ఊరుకున్నాడు. ఈ లోగా ఆముసలివాడు దగ్గిరకు వచ్చేశాడు. ఇద్దరూ ఆవృద్ధుని నఖశిఖ పర్యంతం తేరిపారచూశారు. అతడి దుస్తులు గాడిదగంతరలాగా, చాలా మాసిపోయికూడాఉన్నాయి. తెల్లటిగడ్డం, ఎర్రగా విశాలమైనకళ్ళల్లో ఒక విచిత్రమైన తేజస్సు కనిపిస్తోంది. శరీరచ్ఛాయ నల్లగాఉన్నా అతడిముఖం లోని తేజస్సునుచూసి ఇద్దరూ తెల్లబోయి అలాగేచూస్తూ నిలబడిపోయారు. వృద్ధుడు ఎదటికివచ్చి నిలబడి నవ్వుతూ "సంసారంచెడుది - అని అంటున్నదెవరు? సంసారంతో విసుగెత్తిపోయి, విరక్తిచెందిన ప్రాణం ఎవరిది? సంసారాన్ని వదిలేసి, సన్యాసినవుదామని అనుకుంటున్న దెవరు?" అని అడిగాడు.

ఆముసలివాడి కంఠస్వరం, ఎంతోనిర్భయంగా, పెద్దవాళ్లు కుర్ర వాళ్ళని ప్రశ్నిస్తున్న తీరుగావుంది. ముసలివాడి ఈ ధాష్ట్యం రామచంద్ర దత్తుకి అసహ్యంగా తోచింది, కాని నోటితో ఏమీ అనటానికి సాహసంలేక పోయింది. శ్యామాచరణుడు కూడా మౌనంగాకూర్చున్నాడు.

"ఎవరో సంసారాన్ని వదిలేసి సన్యాసినవుతానని అంటూవుండటం ఇప్పుడేవిన్నాను. ఎవరువారు?" అని మళ్ళీ ప్రశ్నించాడు వృద్ధుడు.

ఈసారి శ్యామచరణుడు ధైర్యంతో— "మాస్నేహితులు ఈయన సంసారం జంజాటంతో విరక్తిచెందారు. అంచేత సన్యాసినవుదామని పిస్తోంది అంటున్నారు అంతే. అంతకన్నమరేంలేదు. హృదయానికి శాంతి లేదంటున్నారు అయన." అన్నాడు.

వృద్ధుడుకాస్సేపు రామచంద్రదత్తుముఖంకేసిచూస్తువుండిపోయాడు మళ్లీనవ్వి, "సంసారాన్ని వదిలి అడవుల్లోపడి తిరుగుతూ, మఠాల్లోనూ గుహల్లోనూ శాంతి వెతకుదామనుకుంటున్నారా? పొరపాటుపడ్డది మీమనస్సు. పెద్దభ్రమలోపడింది. సంసారంకన్న మించింది మరొకటి లేదు. వున్నదేదో సంసారంలోనే వుంది. సంసారానికి చివర వున్నది

అజ్ఞానమే. అడవులూ, పర్వతాలూ, మీరూ అంతాసంసారం (ప్రపంచం) లోనివాళ్లే. పర్వతాల్లో, అడవుల్లో, మీలో అందరిలోనూ వుంది సంసారం. ఇంకదేన్ని పరిత్యజించేది ? సంసారమనేది అతిరిక్తమైనదికాదు. సంసార మనేది శరీరంలో రోమరోమానికి వ్యాపించివుంది. ఇంటికీ, ఊరికి దూరంగా వుండి, శాంతిని వెదక్కోవాలనుకుంటున్నావా? అది చాలాపొర పాటు అపద్ధతిని శాంతి లభించేమాట:నిజమేకాని ఈ పంథా చాలాకఠిన మైనది. దుర్గమమైనదీ. విషయవాంఛలలోనే చాలా వయస్సును గడిపిన మీలాంటివాళ్ళు ఈ పంథాలోకి వచ్చినా శాంతిని పొందలేరు ఒక్క అడుగు కదిలిస్తే లభ్యమయ్యే వస్తువుకోసం మీరీమార్గానికివచ్చి మైళ్ళకొలది ప్రయా ణించటానికి సంసిద్ధులై వున్నారా ? భ్రమ... పెద్దభ్రమ శాంతి అనేది మీసమీపంలోనేవుంది కావాలనుకున్నప్పుడు పొందవచ్చునుదాన్ని. అన్నిటికంటె సులభమైనమార్గం వెతుక్కోవటం అవసరం. మీదగ్గరధనం వుంటే, దానివ్వారా అమార్గం లభ్యమవుతుంది వేలకొలదిగావున్న మీ సోదరులు దరిద్రులు. వాళ్ళదరిద్రం పోగొట్టటానికి ప్రయత్నించండి— వాళ్ళు వుద్యోగాలు చేసేట్టుగా తయారుచేయండి పాఠశాలలువిద్యాసంస్థలు స్థాపించండి. అనాథులకు అనాథాశ్రమాలు, విధవలకు వితంతు శరణా లయాలు నిర్మించండి. బీదరైతులకు వాళ్ళవ్యవసాయంలో సహాయం చెయ్యండి—మీకు శాంతి లభిస్తుంది. మీ వద్ద విద్యాధనముంటే అజ్ఞాను లుగా నున్న మీ వేలకొలది సోదరులను విద్యావంతుల్నిగా చెయ్యండి— మీకునిజమైన శాంతి దొరుకుతుంది. ఎంతసుగమమైన మార్గం ఇది! ఎంత సులభోపాయమిది ! భ్రమ, భ్రమ, ప్రపంచానికి దూరంగా వుండి శాంతి కోసం అన్వేషించటం భ్రమ. చాలా పొరపాటైన అలోచన ! భ్రమ పూరితమైన హృదయంలో పుట్టిన సంగతిది. పరమార్థాన్ని సాధించండి. పరోపకారాన్ని చెయ్యండి. మీకు యధార్థమైన శాంతి లభిస్తుంది.''

ఇలా అని వృద్ధుడు మళ్ళీ బిగ్గరగా నవ్వుతూ! భ్రమ. అంతాభ్రమ! అంటూ వెళ్ళిపోయాడు. మిత్రులిద్దరూ ఒకరిముఖాలొకరుచూచుకున్నారు. రావుసాహెబ్ రామచంద్రదత్తు దీర్ఘంగా నిట్టూర్చి, ''నిస్సందేహంగా నేను పొరపడ్డాను—భ్రమపడ్డాను.'' అన్నాడు...

●

రెండు సంవత్సరాలయింతరువాతమాట—

శ్యామాచరణుడు నవ్వుతూ "ఇహమీకు శాంతిలేదు, ఉద్విగ్నంగా వుంది మనస్సు—అన్నమాట లేదుకదా చెప్పండి" అని అడిగాడు రామ చంద్రదత్తుని.

రామచంద్రదత్తు ప్రసన్నముఖంతో "కాస్తైనాలేదు. ఈ రెండు సంవత్సరాలలో యీ పల్లెటూళ్లలో పది పదిహేను స్కూళ్లు పెట్టించాను. అయిదారు అనాధాశ్రమాలు నిర్మించాను. చాలామంది బీదవిద్యార్థులకు స్టైఫండ్సు, ఇచ్చి వాళ్లకిపైకోర్సు, చదువుకోటానికి అవకాశం కలిగించాను. నా ఎస్టేటులో వేలం వెయ్యటమనే అపప్రథ దూరంచేసేశాను. రైతులకు ఆర్థికసహాయం కలిగించి, వాళ్లకుభూమిమీదహక్కును పొందించాను అనాధాశ్రమంలో అనాధబాలుర ముఖంమీద చిరునవ్వును చూస్తున్నా' పల్లెలలో అభివృద్ధిని చూస్తున్నా, భూమిహక్కును అనుభవిస్తున్న రైతుల తృప్తిని చూస్తున్నా, విద్యాసంస్కారాలు పొందటానికి సంకోచంలేకుండా విద్యనభ్యసిస్తున్న బీదవిద్యార్థులను చూస్తున్నా కలిగేసుఖం, అనుభ విస్తున్న శాంతీ అనిర్వచనీయం" అన్నాడు.

# కవిపత్ని

సత్యవాక్ —

చిన్నప్పుడు మణిరామ్, నేనూ సహాధ్యాయులం. ఒకరికోసంఒకరం ప్రాణాల్ని విడిచేటంత స్నేహం మాకు. ఆరోజుల్లో ఒకర్నిఒకరం చూచుకొనేంతవరకు ప్రాణాలునిలిచేవికావు. అప్పటికింకా 'గ్రాహ్యం' తెలియని రోజులుమాకు. 'గ్రాహ్యం' వచ్చాక ప్రేమస్థానం వైరం ఆక్రమించింది మాలో. ఒకరిరక్తాన్నిఒకరం పీల్చాలనే పిపాసబయలుదేరిందిమాలో. అప్పటికి మేము సుశిక్షితులమైనాం. యఫ్. ఏ. ప్యాసయాక మేమిద్దరం విడిపడిపోయాం. మణిరామ్ మెడికల్ కాలేజిలోచేరాడు. నేనుసాహిత్యప్రపంచములో అడుగుపెట్టాను. పూర్వులునంపాయించియిచ్చిన ఆస్తిపాస్తులుండటంవల్ల - డబ్బువిషయమై నాకొట్టే చింతలేదు. రాత్రింబగళ్లు కావ్యరసాస్వాదనలోపడి, ఒక్కొక్కరోజున అసలు ఇల్లు వదలి బైటకి కూడా వచ్చేవాణ్ణికాదు. ఆరోజుల్లో ఎప్పుడూ ఏదోరాయాలని ఒక్కటే ధ్యాస. వ్రాసేప్పుడు ఒక్కొక్క పదాన్ని ప్రయోగించటానికి గంటల తరబడి ఆలోచించేవాణ్ణి. నేను వ్రాసింది నేనుచూచుకుని గర్వంతో విర్రవీగేవాణ్ణి. ఒక్కొక్కప్పుడు నాకవిత్వములో తులసీదాస్ మహాకవి ఉపమానాలు; సూరదాసమహాకవి రూపకాల స్వాదుత్వంగోచరించేవి కాని నాగేయాలు పత్రికల్లో ప్రకటితమవటం ప్రారంభమయినప్పుడు నాకవితోన్మాదం తగ్గటం ప్రారంభమయింది. కాని దాని ప్రభావం మాత్రం తగ్గలా. అది యశఃప్రఖ్యాతులవల్ల కలిగిన ప్రభావం. కొద్దిసంవత్సరాల్లోనే నాపేరు హిందీ సాహిత్య ప్రపంచంలో ప్రసిద్ధమయింది. అప్పుడు నేనేపనీచేసేవాణ్ణికాదు. గొప్ప గొప్ప వాళ్లని ఆహ్వానించి 'పార్టీ'లుమాత్రం ,ఇస్తూఉండేవాణ్ణి. ఇంతకన్న మరొకవిధంగా మనస్సు ప్రశాంతంగా ఉండేదికాదు. కవిత్వవిషయంలో అంతశ్శ్రద్ధ కలిగేదికాదు. మొదట్లో నాకు సమయమంతా కవితావ్యాసంగంలోనే జరిగినా- ఇప్పుడు నాకదిమనస్సు ఆహ్లాదాన్ని కలిగించేసాధనంమాత్రమే అయింది. కానిఎప్పుడైనా కొంతవ్రాసినప్పుడు ఆప్రభావంకనిపించేది. సామాన్యవిషయాలను కవితావస్తువుగా స్వీకరించినా దానికి జీవంపోయగలిగేవాణ్ణి.

అక్కడ మణిరామ్ వైద్యగ్రంథాలలోపడి తల పగలకొట్టుకుంటూ ఉండేవాడు. అయిదేళ్లకతడు 'అసిస్టెంట్ సర్జరీ' పరీక్షప్యాసై ప్రాక్టీస్ ప్రారంభించాడు. పరీక్షాఫలితాలు పడ్డప్పుడొకసారి మాత్రం అతడిపేరు పత్రికల్లోఅచ్చుఅయింది. ఆతర్వాత మళ్లీఎప్పుడూ అతడిపేరు పత్రికల్లో పడలా, ఇటుచూస్తే నా ప్రశంసలతో పత్రికలు రోజూ నిండిపోతూ వుండేవి. అతడు రోజూ తన ఆస్పత్రిలో కూర్చుని రోగులకోసం ఎదురు చూస్తూ ఉండేవాడు. కాని అతడిపేరు ఎవరికితెలుసు? ప్రజలక్కడికి వెళ్లటానికి సంకోచించేవాళ్లు. నేను అతడివైపు చూస్తే - స్వంతకారులో వెళ్లేవాళ్లు - రోడ్డుమీద నడిచేజనాన్ని ఎంత అలక్ష్యంగా చూస్తారో - అంత నిర్లక్ష్యంగా చూసేవాడు.

.... .... .... ....

ఒకనాడు ఓ వుత్తరంవచ్చింది. అది నాకవిత్వాన్ని ప్రశంసిస్తూ వ్రాసిన ఉత్తరం. నేను దేశానికీ జాతికీకూడా గౌరవం తీసుకురావటానికి కారణభూతుణ్ణిట! ఇలాంటి ఉత్తరాలు సాధారణంగా నాకు రోజూ వస్తూనే ఉంటాయి - ఇదేం కొత్తకాదు. నేను అప్పుడప్పుడు ఇలాంటి వుత్తరాలు చూసి విసుక్కుంటూ ఉండేవాణ్ణి. కాని ఇది ఒక స్త్రీ దగ్గరనుంచి వచ్చిన ఉత్తరం. మనం సాధారణంగా ఇలాంటి ఉత్తరాలు పురుషులదగ్గిర్నుంచిఅపేక్షిస్తూఉంటాం కానిస్త్రీలుఇలాంటిఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతారని ఆశించము.అయితే ఈ ఉత్తరంఒకసామాన్య స్త్రీ దగ్గిర్నుంచి వచ్చిందిమాత్రంకాదు. డెహరాడూన్‌లో సుప్రసిద్ధశ్రీమంతుడైన హృదయనారాయణ్‌గారి కొమార్తె సావిత్రి వ్రాసిన ఉత్తరం. ఆమె విద్యావతి, ఈ సంవత్సరమే బి. ఏ. ప్యాసయింది. అలాంటివి పత్రికల్లో చాలాఉత్తరాలు వెలువడుతూ వుండేవి. కాని వాటిని చదవవలసినంత అవసరమున్నట్లు కన్పించేదికాదునాకు. కాని ఈ వుత్తరం వాటన్నిటినీ జ్ఞప్తికితెచ్చింది. వెంటనే సమాధానం వ్రాయటానికి కూర్చున్నాను. పరీక్షల్లో విద్యార్థులు ప్రశ్నలు అన్సరుచేయటానికికూడా అంత శ్రద్ధగా కూర్చోరు. ఒక్కొక్కమాట దగ్గిరే ఆగి, మళ్లీ ఆపదాన్ని తీసేసి కొత్తకొత్త పదాల్ని ఆలోచించి - కొత్తకొత్త అర్థాలు స్ఫురించేట్లు రాశాను. సావిత్రిని, ఆమె విద్వత్తును ప్రశంసించటంలో నిఘంటువులలో వున్న సుందరమైన శబ్దాలనన్నీ వుపయోగించాను. దానిప్రక్కనే నా అయోగ్య

తనుకూడా అంగీకరించా - మీరు నన్ను ప్రశంసిస్తున్నారంటే అది మీలో వున్న వుదారస్వభావం - కాని లేకపోతే నాకవిత్వంలోఏముంది? కల్పనా సౌందర్యమూలేదు. శబ్దాలలో మాధుర్యమూలేదు. కవిత్వానికి రసం ప్రధానం. కాని దానికీ నాకవిత్వానికి చాలాదూరం. మనం కవులమయి కూర్చుంటాంకాని కవి అవటంనిజానికి అంతసులభంకాదు. ఇలారాయటం నన్ను ప్రశంసింపచేసుకోటానికి ఇదికూడా ఒకపద్ధతి అని చెప్పనవసరం లేదు.

కొద్దిరోజులు గడిచాక ఆ వుత్తరానికి జబాబువచ్చింది. ఆమె «మీరు కేవలం మహాపురుషులు, మిమ్మల్ని 'టెన్నిసన్' వర్డ్స్‌వర్త్ కన్న గొప్పగా భావిస్తున్నాను నేను. మీది రసహీనమయిన కవిత్వమని మీరు రాశారు. అయితే అవునేమోకాని అదినన్ను మంత్రముగ్ధని చేసింది. అది చదివి నేను గంటలతరబడి ప్రేమసముద్రంలో మునిగితేలుతున్నాను. అన్నం నీళ్లూకూడా మరచిపోతున్నాను. మీ 'లేఖిని'ని ముద్దుపెట్టుకోవాలని మహా అనిపిస్తోంది'' అని రాసింది.

ఈ వుత్తరం విస్కీ బాటిల్‌కి మరోస్వరూపం లాంటిది. ఆచివర వాక్యం హృదయంలో ఒక విధమైన అగ్నిని పుట్టించింది. నేనుమళ్లీ సమాధానంరాశా. అవుత్తరంలో నామనస్సును ప్రతిఫలింపచేశాను. కవి తనకి ఇష్టమైనవారిని ఆకాశానికి ఎత్తగలడు. నేనుకూడా సావిత్రిని ప్రశంసించటంలో భూమ్యాకాశాలను ఏకం చేశాను - కార్లయిల్ ఏమన్నాడంటే' - కేవలం కవిత్వం రాసినవాడే కవికాదు. ఆకవిత్వాన్ని అవగాహనచేసుకొని, అందులోని కవిహృదయాన్ని తెలుసుకున్నవాడు కూడాకవే' అన్నాడు. కనుక ఈ లెఖ్క ప్రకారం నువ్వుకూడా కవయిత్రివే. నేనుఎన్నైన్నో చూడగలనుగాని, కవితామహత్త్యాన్నిమాత్రం తెలుసుకోలేను. కాని నువ్వు ఏ అక్షరానికి ఆ అక్షరం విరిచి అందులోని సౌందర్యాన్ని చూడగలవు. నీప్రతిభకు నాకు ఆశ్చర్యంకలుగుతోంది. నీమూలంగా భారతమాత ధన్యురాలైంది ! '' అనిరాశాను.

నేను ఎన్నోనవలలు చదివాను. అద్భుతమైన కావ్యాలెన్నో చదివాను కాని సావిత్రి వుత్తరాల్లో కన్పించే రసభావాలుకాని, స్వాదుత్వం కాని వేటిల్లోనూ కనిపించలా నాకు. మాటి మాటికీ వాటినే చదవాలనిపిస్తూ వుంటుంది.

సావిత్రి—

నిస్పందేహంగా ఆయన నన్ను కాంక్షిస్తున్నారు. లేకపోతే ఇంత త్వరగా ప్రత్యుత్తరాలు వ్రాసేవారుకాదు. ఇవాళ ఉత్తరం రాస్తే మూడోనాటికల్లా సమాధానం వస్తుంది. అసలు నాపుత్తరాలకోసం నిరీక్షిస్తూ వుంటారేమో అనికూడా అనిపిస్తూ వుంటుంది. ఆ వుత్తరాలు వారి కవిత్వంకన్నకూడా రసవత్తరంగా వుంటాయి. వాటిని చదివితే మనస్సు కెంతో ఆహ్లాదంకలుగుతూ వుంటుంది.

ఒకసారి ఫోటో పంపుతున్నానని వుత్తరంరాస్తే- "నువ్వుఫోటోపంపుతున్నానని వుత్తరంరాశావు. కాని అది నాకింకా చేరలేదు. ఆ రిజిష్టర్ రసీదు పంపితే పోస్టాఫీసుకువెళ్లి 'కంప్లైంట్' చేస్తాను" అని సమాధానం రాశారు. నాఫోటోపంపగానే సమాధానంగా వారి ఫోటోవచ్చింది. నేనుఊహించింది నిజమేఅయింది. ఎంత సుందరమూర్తి! ముఖంలో రాజకుమారుల ముఖంలో వుండేలావణ్యం వుట్టిపడుతోంది! చూడగానే నాహృదయానికి స్వాస్థ్యంతప్పింది. అది ఫోటోయేకాని వాస్తవానికి నామనస్సును మాత్రం అపహరించింది వారి మధ్య వ్రాసిన గేయాలు వారి హృదయాన్ని నాకు మరింత సన్నిహితంచేశాయి - 'ప్రియ తమతో' అన్నది ఎంతప్రియతమమైన శీర్షిక! ప్రత్యక్షరంలోనూ ప్రేమ తొణికిసలాడుతోంది. ఈ గేయాలకు పూర్వం రాసినవికూడా నామీదరాసినవే. మీరు నన్ను అప్రతిష్ఠ పాలుచేసి కాని విడిచిపెట్టరా? మన మిద్దరిమధ్య ఉన్న 'దూరాన్ని' పోగొట్టి మీరు నావెంట ఎందుకుపడుతున్నారో చెప్పండి అని రాశాను. ఇంకోచోట ప్రకటితమయిన గేయాన్నిబట్టి చూస్తే ఇంకా ఆయన అవివాహితుడనే తోస్తుంది. అయితే, నా ......కాని వా రెందుకు యింత పరిశ్రమ చెయ్యటం? ఎక్కువగా చదవటం వ్రాయటం, అనేది మనిషిని శుష్కింపచేస్తుంది. కవిత్వం రాయటంమానేసి, మీ శరీరం విషయమై శ్రద్ధ వహించండి - నాకు చాలా విచారంగా ఉంది అని రాస్తాను. తర్వాత నేను వారినిగురించి అన్నీ తెలుసుకున్నాను. ఆయన అవివాహితుడు, మా శాఖీయుడే అని కూడా తెలిసింది.

నేను ఉత్తరం రాశాను. అయితే ఇదివరకు రాసిన ఉత్తరాలకూ

ఈ వుత్తరానికి చాలాభేదంఉంది. ఇందులో 'సంకోచం' అనేది ఏమాత్రం చూపించలా. "మీ ఉత్తరాలవల్ల ఏమాత్రం సంతోషం కలగటంలా. మీ దర్శనం కనుక అయితే మి పాదాలమీదవాలి పాదాల్ని ముద్దుపెట్టుకుందామని మహాఅనిపిస్తోంది. ఇంక వృథాఆశలు కలిగించకండి. ప్రతిక్షణం మిమ్మల్ని ఎదురుగా చూడాలనిపిస్తోంది. సాధారణంగా నిద్రపోతూపోతూ ఉలిక్కిపడుతూ ఉంటాను. మీ భోజనభాజనాలకు ఎలాంటి వసతులున్నాయా అని ఆలోచిస్తూ ఉంటాను. రాత్రిళ్లు అట్టేసేపు మేలుకోకండి. ఆరోగ్యం పాడైపోతుంది. ఆరోగ్య విషయమై ఎక్కువశ్రద్ధ వహించండి. నాకు ఉత్తరం రాయటం మరిచిపోవద్దు. నామనస్సు మహా-ఆందోళనగాఉంది. నన్ను మీ చరణదాసినిగా భావించండి" అని రాశాను.

నాలుగోరోజున ఉత్తరం రాగానే నేను ఎగిరిగంతువేశాను. ఆయన నన్ను వివాహం చేసుకోవటానికి కేవలం ఏకీభవించటమే కాదు. చాలా ఆతురత పడుతున్నారుకూడా. నేను కళ్లు మూసుకుని కలుగబోయే సాహచర్యాన్ని భావించుకుని ఆనందడోలికల్లో ఊగులాడసాగాను. ఇంతలో ఎవరో వస్తున్నట్లు అలికిడి అయింది. నేను కళ్లు తెరిచిచూశాను. తమ్ముడు ప్రభాశంకర్ ఒక 'బండిల్' ఫొటోలు తీసుకువచ్చి నుంచుని ఉన్నాడు. నేను ఆశ్చర్యంతో "ఇవేమిటి ప్రభా ?" అని అడిగాను.

"ఈ ఫొటోలన్నీ చూసుకుని, సెలెక్టు చేసుకోమనీ; ప్రతిఫొటోతోనూ ఉన్నఉత్తరాలను కూడా చదువుకోమనీ నాన్నగారు చెప్పమన్నారు" అని వాడు ఆ ఫొటోలన్నీ నాచేతికిచ్చి గబగబావెళ్ళిపోయాడు.

నేను ఆ 'బండిల్' విప్పాను. ఈ ఫొటోలలో వున్న పురుషులంతా నన్ను వివాహమాడాలని అభిలషిస్తున్నవారే. నేను నాలోనవ్వుకుంటూ వాటిని విరక్తిభావంతో చూశా. ఒకరు బారిష్టరు. మరొకరు డాక్టరు - ఇంకొకరు ఇంజనీరు. కాని నా కెవరూ నచ్చలా. నా మనస్సులో ఒక్కవ్యక్తికే స్థానముంది. నేను చటుక్కున లేచి, ఈ ఫొటోలన్నీ ఒక పెట్టెలోపెట్టి దానిమీద passed అని స్లిప్‌రాసి అంటించి నాన్నగారిదగ్గరకు పంపించేశా. ఆయన తెల్లబోయారు. ఇలా చేస్తానని ఆయన ఊహించలా. ఏ లక్షాధికారి కొడుకునో నేను కోరుకుంటా ననుకున్నారు కాని, నేను ఓ కవిని కాంక్షించాను. కాని ఆయనంత నిర్ధనుడూకాదు, ధనాఢ్యుడూకాదు. నన్ను కోరిన వారిలో కొంతమంది ఆయన్ని ఖరీదు చేయగలిగినంత సమర్థులుకూడా

ఉన్నారు. ప్రేమ గుడ్డిదని అన్నారేకాని దాన్ని చూసి గ్రహించటం ఎవరు నేర్చుకున్నారు ? నాన్నగారు నా అభిలాషతో ఏకీభవించారు. ఆయన నన్నెంతో గారాబంగా పెంచి, నా చదువుకోసం ఎంతో డబ్బుఖర్చుచేశారు. ఈ విషయంలో ఆయన నాకు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని యిచ్చారు.



చివరికీ భయపడినంతా ఆయింది. వారికి జ్వరం రావటం ప్రారంభించింది. అది క్షయలోకి లాగుతుందేమో అని డాక్టర్లకు సందేహం తో. చింది. ఈ సంగతి విని మా నాన్న చాలా దుఃఖపడ్డాడు. తనకు కూడా ఏదో వ్యాధి వచ్చినట్లు ఎప్పుడూ ఉదాసీనంగా ఉండేవాడు. నే నింక ఈ వివాహప్రస్తావన వదులుకోవాలని ఆయన ఇచ్ఛ. మండుతున్న నిప్పుల్లో దూకటం బుద్ధిమతి చెయ్యతగ్గ పనికాదు. కాని నేను దీన్నిలక్ష్యపెట్టేదాన్ని కాదు. ప్రపంచదృష్టిలో మేము అవివాహితులం ; కాని మనస్సులురెండూ కలుసుకున్నాక అవి ప్రేమసూత్రముతో బంధిత మయాక - ఇంక మిగిలిందేముంది ? నేను యిప్పుడు వారికి ఆత్మీయురాలినయిపోయాను. ఏ వ్యాధులుకాని, ఏ నియమాలుకాని, ఏవీ నన్ను ఆయన్నించి వేరుపరచ లేవు. మృత్యువుకూడా అంత సాహసంచెయ్యలేదు. సావిత్రి సత్యవంతుణ్ణి యమపాశాల నుంచి తప్పించింది. నాపేరూ సావిత్రేగా! నేను వారిని వ్యాధినుంచి విముక్తులను చేయలేనూ ? ఆ భారత భూమిలోనే నేనూ పుట్టాను. ఆమెచేసిన పనినే మళ్లీ నేను యీనాడు ప్రత్యక్షంగా చూపుతాను.

సాయంకాలమయింది. నాన్నగారు ఆయనగదిలో కూర్చునివున్నారు. నాకు చాలా కష్టంవేసింది. అది ఆయన క్లబ్బుకు వెళ్ళేసమయం. ఎంత చలిగా వున్నా, ఎంత వుక్కగా వున్నా తప్పకుండా వెళుతూ వుండేవారు. ఇది ఆయన నియమం. ఏ రోజునా వెళ్లకపోవటమంటూ వుండేదికాదు. నేను ఆయన దగ్గిరకు వెళ్లికూర్చుని మెల్లిగా "ఇవాళ నువ్వు క్లబ్బుకు వెళ్లలేదేం నాన్నా?" అని అడిగాను.

ఆయన సమాధానమేమీ ఇవ్వలా.

"మీరు చాలా నిరుత్సాహంగా కన్పిస్తున్నారు"

"అయితే నీకేం?"

"మీ ఆరోగ్యం పాడైపోతుందేమో?"

"మరేం ఫరవాలేదు"

"మీరు నగమైనా భోజనం చెయ్యటంలా"

"నా కివన్నీ తెలుసు"

"ఏ డాక్టరికయినా చూపించటం మంచిది - వ్యాధిని ముదరనీయటం మంచిదికాదు"

"ఇప్పుడు నాకింక డాక్టరు యమధర్మరాజే"

నాకు కళ్లవెంబడి నీళ్లు వచ్చాయి. తల క్రిందికి వంచుకున్నాను. నాన్నగారు మరొకవైపు చూస్తున్నారు. కాని నా కన్నీళ్లు చూశారాయన. సంభాషణ చటుక్కున మార్చేసి "సావిత్రీ! నేను నా దురదృష్టానికి దుఃఖిస్తున్నాను, నీ కెందుకు?" అన్నాడు.

ఆయన నామీద ఏదో అత్యాచారం చేసినట్లు చూశా నేను. "మీరు నాకు తండ్రి. నా కన్నీళ్ళలోని రహస్యాన్ని మీరుకూడా గ్రహించలేరా? మీ ప్రతిమాటా తేనె పూసిన కత్తిలావున్నాయి. ప్రతి పదమూ విషలిప్తమైన బాణం. మీకు మిత్రులూ, ఆప్తులూ, క్లబ్బూ, పనిపాటా ఎన్నో వున్నాయి. మీరు బైటికి వెళ్లిపోతారు. నేను ఇంట్లో కూర్చుని నా విషయమై దుఃఖిస్తూ వుంటాను. నే నాడపిల్లను. నానోటిమీదుగా ఇలాంటిమాటలు రావటం మంచిదికాదు. కాని ఏం చెయ్యను? చూస్తే నా సర్వస్వమూ అపహరితమవుతోంది. మాట్లాడకుండా ఎలా కూర్చోను? మీరు ఆలస్యం చేస్తూ నా భవిష్యజ్జీవితాన్ని అంధకారమయం చేస్తున్నారు" అన్నాను.

నాన్నగారు చాలా అదుర్దా పడుతూ, "చూస్తూ చూస్తూ యిలాంటి అనుచితమయినపని చెయ్యటం మాటలుకాదు సావిత్రీ! నీ సేవా శుశ్రూషలతో ఆతడు ఆరోగ్యవంతుడవుతాడనే విశ్వాసమున్నదా నీకు?" అన్నారు.

"అఁ అయన్ని రక్షించగలననే విశ్వాసంవుందినాకు. కవులు సాధారణంగా ఆలక్ష్యంతో వుంటారు. సాధారణంగా చదువుల్లోనూ, వ్రాతపనుల్లోనూ కాలం గడుపుతూ వుంటారు. నేను వారిని జీవితంలోని సమస్తమయిన జంజాటాలనుంచీ నిశ్చింతుల్నిగా చేసి ఇల్లూ వాకిలీ ఏర్పాట్లన్నీ స్వయంగా చూస్తాను. రాత్రింబవళ్ళు కవితా వ్యాసంగంలోపడి వుండటంవల్ల వారి ఆరోగ్యం యిలా పాడై వుంటుంది. ఏ పత్రిక చూసినా అందులో వారి రచన వుంటూనేవుంటుంది. నేను వారిని యిలా చేయనీయ

కుండా అడ్డుపడతాను. ముందు మీఆరోగ్యం చూసుకున్ని తర్వాత కవిత్వ విషయం చూసుకోండి అని చెబుతాను' నౌకర్లచేతిమీది భోజనం చేస్తూ వుండేవాళ్ళకు భోజన సౌకర్యం ఏమంత వుంటుంది ? స్తోత్రం చెయ్యటానికి చాలామంది వుంటారు, కానీ సహానుభూతి చూపించేవాళ్ళు ఎవరూ వుండరు."

నా ఈ మాటలు నాన్నగారిమీద చాలా పనిచేశాయి. కొంతసేపటి వరకు అయన నోరు మెదల్చలేదు "ఇదంతా బాగానే వుంది. కాని చెప్పటంలోనూ, చెయ్యటంలోనూ చాలాభేదంవుంటుంది. నువ్వు చెప్పినట్లల్లా చేయగలవో లేవో అని నాకు చాలా సందేహంగా వుంది" అన్నారు.

నా ముఖం అభిమానంతో ఎర్రపడింది. మళ్ళీ నన్ను నేను సంబాళించుకుని—"నేను నా మాటల విషయమై బాధ్యత తెలియనిదాన్నికాదు చెప్పినట్లల్లా చేసి చూపిస్తాను" అన్నాను.

"ఇవన్నీ కేవలం భావనలేకాని, సమయం వచ్చేసరికి ధూపానికి కాకుండా ఎగిరిపోతాయి"

"నా ఉద్దేశ్యంలో ప్రపంచమంతా భావనతోనే బ్రతుకుతోంది"

నాన్నగారు ఏమీ మాట్లాడలా ఎంత ఆలోచించినా ఆయనకు సమాధానం దొరకలా. తల వంచుకుని కాస్సేపు ఆలోచించసాగారు. మళ్లీ చటుక్కున లేచి నాతో ఇంకేమి మాట్లాడకుండా బైటికి వెళ్ళిపోయారు.



వివాహమయిపోయింది. ఆ మాట ఒక్తి అబద్ధమయింది. వారు ఆరోగ్యంగాఉండటం చూసేసరికి నామనస్సు సంతోషతరంగితమయింది. ముఖంలో లాలిత్యం, నేత్రాల్లో కళ తొణికిసలాడుతున్నాయి. నేను చాలా మంచి కవుల చరిత్రలు చదివాను. అందరిలోనూ ఒక్కదోషం మాత్రం కన్పించేది. అది ఏమిటంటే వారి ప్రవర్తన అంత పవిత్రంగా ఉండదు. కాని వీరి విషయంలో అలా ఊహించటంకూడా మహాపాపం. పరాయి స్త్రీలకేసి కన్నెత్తి చూడటం అంటే ఆయనకు మహా - సిగ్గు. నాకోసం ఎవరైనా స్నేహితురాండ్రు వస్తే ఆయన లేచి లోపలికి వెళ్లేవారు. మీరు పురుషులు, స్త్రీలే 'పరదా' పాటించకపోతే పురుషులెందుకు పాటించటం ? అని

ఎన్నో విధాల నచ్చచెప్పాను. కాని ఆయన నవ్వుతూ ఈ మాటలన్నీ ఎగర కొట్టేవారు. నాకు వారిమీద చాలా విశ్వాసం. ఏది ఎలా జరిగినా వారి మన స్సుకు మాత్రం మాలిన్యం సోకదని నాకు తెలుసు. ఇలాంటి పురుషుడు లభించటం నా సౌభాగ్యం. వారు తమ సర్వస్వాన్నీ నాకు అప్పగిం చేశారు. వారం గడిచినా తమ బట్టలు మాసిపోయాయనికూడా తెలియదు వారికి నేను చెప్పి మార్పించాల్సిందే. ఆయనకు పాలు కావాలన్నా, పళ్లు కావాలన్నా అన్నీ నేనే తెచ్చి యిచ్చేదాన్ని. వారి గదికూడా నేనే తుడిచి శుభ్రం చేయాలి. నా స్థానంలో మరో అలసత్వం కల స్త్రీ వచ్చి నట్లయితే ఏం జరిగేదా అని అనుకునేదాన్ని. గదినిండా ఎప్పుడూ ధూళి పడుతూండే జబ్బు చేస్తుంది. వారు తమ గదిని శుభ్రంగా ఉంచుకోవటం విషయంలోకూడా శ్రద్ధ వహించేవారుకాదు. అదికూడా నేను చూడాల్సి వచ్చేది. ఇదివరకల్లా నౌకర్లు నెత్తినెక్కి కూర్చున్నవాళ్లు - ఇప్పుడుకాస్త తగ్గారు. ఈ దౌర్భాగ్యులు ఏ పనీ చేసేవాళ్లు కాదు. నెత్తిమీద ఎక్కి తొక్కేంతవరకూ చేతులు ముడుచుకు కూర్చునేవాళ్లు. అప్పుడప్పుడు వారిమీద నాకు కోపంకూడా వస్తూఉండేది. వారిపనులు శ్రద్ధగా ఎందుకు చేసుకోకపోవాలి! నేను నాలుగురోజులు ఇంట్లో లేకపోయానంటే ఇల్లంతా చెదలు పట్టాల్సిందే.

"దేశమంతా మీ కవితా ప్రభావం వ్యాపించిందికాని, మీరింత నిర్ల క్ష్యంగా ఉంటారని, బద్ధకస్తులనీ ఎవరికయినా తెలుసా?" అని అడిగా ఒక రోజున.

వారు నవ్వుతూ "నువ్వు పత్రికల్లో ఈ విషయమై ఒక వ్యాసం రాయరాదూ?" అన్నారు.

"మీ కప్రతిష్ట వస్తుంది"

"అందులో కొంత భాగం నీకూ సంక్రమిస్తుంది"

"నాకెందుకు సంక్రమిస్తుంది? మీరు అన్నీ నవ్వులతో ఎగరకొట్టే స్తారు. ఇంత నిర్లక్ష్యంవల్ల ఏమయినా ప్రయోజనం ఉందేమో కాస్త ఆలో చించి చూడండి?"

"నేను నిన్ను ఈ యింటికి రాణిని చేశానుగా!"

"నేను ఇంటికి రాణిని అయినాను సరే కాని మీరు మీఆఫీసురూమ్ విషయమై కాస్త శ్రద్ధ వహించండి"

"నేను నిన్ను సూపరెంటెండెంట్‌గా భావిస్తున్నాను"

నేను కోపంవచ్చి వెళ్లిపోయాను. కాని నా హృదయం - నీళ్లమీద చంద్రబింబం నాట్యంచేసినట్లు - సంతోషంతో లాస్యంచేసింది. మర్నాడు ప్రొద్దున్నే నేను వారి ఆఫీసురూమ్‌కేసి వెళ్లేసరికి గుమ్మదగ్గర ఒక చిన్న సైన్‌బోర్డు వ్రేలాడకట్టి ఉంది. దానిమీద — 'సావిత్రీదేవి, బి. ఏ., సూప రెంటెండెంట్'' అని రాసి ఉంది.

నేను చటుక్కున దాన్ని లాగేసి వారిముందర విసిరి పారేశాను. "ఇలాంటి పాడుపనులు చేయటంచూస్తే లోకులేమనుకుంటారు?" అన్నాను.

వారు నాకేసిచూసి నవ్వుతూ చేతులు చాచారు.



సాయంకాలమయింది. నేను నా కున్నవాటిల్లోకల్లా మంచి చీరె కట్టుకుని, వారిదగ్గరకు వెళ్లి— "కాస్సేపు అలా షికారు వెళ్లి వద్దారండి" అన్నాను.

వారా సమయంలో కవిత్వరచనలో నిమగ్నులైఉన్నారు. "ఇప్పుడు మాట్లాడించకు చాలా విచిత్రమైన భావం స్ఫురించింది. దాన్ని వెలిబుచ్చ టానికి చక్కని పదాలకోసం వెతుక్కుంటున్నాను" అన్నారు మెల్లిగా.

నాకు మండిపోయింది. పురుషులెలాంటివాళ్లు! ఎప్పుడు తమ ధ్యాస లోనే తాము మునిగి తేలుతూ ఉంటారు. నాకు ఎలాంటి సమయంలో ఉత్సాహంగా ఉంటుందా అన్నసంగతినూడా వారు ఆలోచించరు. మొద ట్లో నన్ను చూస్తే ప్రసన్నులై నట్లుండేవారు. కాని యిప్పుడు వారి హృద యం ప్రేమవిహీన మయిందా అనిపిస్తోంది. అవును - వారి హృదయా న్నంతా కవిత్వంలో ప్రతిఫలింపచేస్తున్నారు. నా కళ్ళు నిప్పులుకక్కటం ప్రారంభించాయి — "ఎప్పుడూ కవిత్వం గొడవే పెట్టుకుంటే యింక ప్రాపంచిక ధ్యాస అక్కరలేదా?" అని అడిగాను.

"ఈ కవిత్వంతో సాహిత్య ప్రపంచంలో కల్లోలం బయలుదేరు తుంది"

"అసలు మీకు నామీదనైన ధ్యాస ఉందా లేదా?"

"ఇది నీ హృదయాన్ని ప్రశ్నించుకో"

"నేను నా హృదయాన్ని అడగను, మిమ్మల్నే అడుగుతున్నా. కాస్త కళ్ళు పైకెత్తి సమాధానం యివ్వరాదూ?"

"ఈ రచనను కనుక చూస్తే ఎంతో ఆనందం కలుగుతుంది. ఇలాంటి కవిత్వం నే నింతవరకు ఎన్నడూ రాయలా."

నాకు విరక్తి కలిగింది' "ఇవాళ కాస్త షికారుకెళ్లి వద్దామని నాకు మహా అనిపిస్తోంది. అదికాస్తా ఈ కవిత్వం పాడుచేసింది. కాగితాలు లాక్కొని చింపేసి, సిరాబుడ్డి పగలగొడదామని పిస్తోంది" అన్నాను.

"సిరాబుడ్డి కాగితాలు పాడుచెయ్యటమనేది సామాన్యవిషయం. కాని ఈ భావం మళ్లీ స్ఫురించదు. ఇవాళ ఒంటరిగా వెడుదూ!"

"నా కలా వెళ్లటం ఇష్టంలేదు"

వారు చేత్తో వెళ్ళిపొమ్మన్నట్లు సైగ చేసి మళ్లీ దృష్టి కాగితాలమీదికి పోనిచ్చారు. నా హృదయంలో బల్లెం గ్రుచ్చినట్లయింది. వారి ధ్యానంతా కవిత్వంమీదనే కాని, నా మీదలేదు. ప్రపంచంలో పేరు రావాలని వాంఛిస్తున్నారు, కాని ఇంట్లో ప్రేమను కాంక్షించటం లేదు. ఇక్కడనుంచి వెళ్ళేసరికి హృదయంమీద ఏదో బరువుఎత్తి నట్లు తోచింది. ఒంటరిగానే షికారుకు వెళ్ళాను. మనస్సు ఉదాసీనంగా ఉండటంవల్ల, షికారుమీద కూడా బుద్ధిపోలేదు. వెళ్ళి ఒక వంతెనమీద కూర్చుని, నా స్థితిని తలచుకుని దుఃఖించసాగాను. ఈ అశ్రువులును చూస్తే అప్పుడు నాన్నగారు వ్యాకుల పడుతూఉండేవారు. వివాహం కాగానే నా సుఖదుఃఖాల భారం ఒక కవికి అప్పగించారు కాని ఇప్పుడు ఈ అశ్రువులను చూసేవారూ, వీటివల్ల హృదయంలో బాధపడే వారు ఎవరూ లేరు. నా జీవితనావ నదీ ప్రవాహంలో కొట్టుకుపోతున్నట్లు - దానికి కర్ణధారుడు లేనట్లూ తోచింది. నేను ఇలా యితరులమీద ఆధారపడి ఉండటాన్ని. తలచుకునేసరికి నా హృదయం ఉడుకెత్తిచూస్తూ వుండేదాన్ని - ఒకవేళ మళ్ళీవస్తున్నారేమో అని....ప్రేమకు చటుక్కున వైరాగ్యంకలగదు.

నా దృష్టి నీళ్ళమీద వుంది. ఏదయినా శక్తి మంత్రబలంవల్లనన్ను ఒక అలగా చేస్తే, ఈ గంగాప్రవాహం మీద తేలిపోదును కదా అని ఆలోచిస్తున్నా. చటుక్కున కళ్ళుమూతలు పడ్డాయి. నిద్రాదేవి నావాంఛను ఫలింపచేసింది. నేను గంగానదిలో పడ్డాను. కాళ్ళూచేతులూ కొట్టు

కుని ఒడ్డుకి రావాలన్నా రాలేకపోయాను. ప్రవాహంమీద కొట్టుకు పోతున్నాను.

తెలివి వచ్చేసరికి నేను ఇంటిదగ్గర వున్నాను. వారు ఎదురుగా నుంచుని వున్నారు. కుర్చీలో ఒక డాక్టరు కూర్చుని వున్నాడు.

“అమ్మయ్యా! బ్రతికావు. ఈయనకి ధన్యవాదాలర్పించు. ఇతడు నా మిత్రుడు డాక్టర్ మణిరామ్. యిప్పుడు కాశీలో ఈయనపేరు చెబితే చాలు పూజిస్తూ వుంటారు. యితడు నదిలో దూకకపోయినట్లైతే నిన్ను బ్రతికించటం అసంభవమై వుండేది” అన్నారు వారు.

నేను మెల్లిగా లేచి కూర్చున్నాను. శిరస్సుమీద చీరె అంచు ముందుకు లాక్కుని నేను డాక్టరుకేసి చూశాను—కళ్లు ఇంక మూసుకోలేక పోయాను. ‘భగవంతుడు తమకు మేలుచేయాలి’ అంటూ కళ్లు మూసుకున్నాను నేను. కాని హృదయంలో అలజడి బయల్దేరింది. ఇతడు లేచి వెళ్లిపోతేబావుండును—నాకు ధైర్యం మళ్లీ తిరిగి వస్తుంది అనుకున్నా. కాని ఎప్పుడైతే అతడు వెళ్లిపోయాడో, అప్పుడు నేను పొరబాటు చేశానని తెలుసుకున్నా. వ్యాకులపాటు మరింత అధికమయింది. నీళ్లమీద తేలిపోవామని వెళ్ళాను. నిప్పును కొనుక్కు తెచ్చుకున్నాను.

●

## మణిరామ్—

“రాత్రిళ్ళు ఎంత ప్రొద్దుపోయినా నాకు నిద్ర వచ్చేదికాదు. నా కళ్లల్లోని నిద్రను సావిత్రి కళ్ళుఅపహరించాయి. ఆ నేత్రాల్లో ఎంత అకర్షణఉంది! ఖైదులో ఉన్నవ్యక్తి యినప కటకటాల్లోంచి స్వతంత్రసృష్టిని చూస్తూ నిరాశతో నిట్టూర్పులు విడుస్తున్నట్లు—ఆమె నేత్రాల్లో ఎంత పరాధీనత! ఆమె కళ్ళు నా మీదనే వాలేవి. కాని—తల్లి కనుక కొంచెం గ్రాహ్యం ఉన్న కుర్రవాడు యితరుల ఆటవస్తువులను పట్టుకోబోతే, చటుక్కున వాణ్ణి ఒళ్లోకి ఎలా లాక్కుంటుందో—అలాగే ఆమెదృష్టి మరల్చుకునేది. ఆ సమయంలో కుర్రాడు ఎలా పెనగులాడతాడు! అమ్మను వదిలేసి ఆ ఆటవస్తువుని తీసుకుని పారిపోవామనుకుంటాడు. సావిత్రి స్థితి కూడా యిలాగే ఉంది. సత్యవాన్ అభ్యంతరంగా ఉన్నాడు. రెండు నిమి

పొలు కనుక అత డెక్కడి కయినా కదిలివెళ్ళాడంటే తనివితీరా అమెకేసి చూసేవాణ్ణి! సంపంగిపువ్వులా ఎంత మనోహరంగా ఉంది.

మర్నాడు అస్పత్రికి వెడుతూండగా అమె గుమ్మందగ్గర నుంచుని ఉండటం చూశాను. అమె నాకేసి ఏంతో పిపాసాదృష్టితో చూసి చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వులో విద్యుత్ ఉంది. అది నాధైర్యాన్ని పోగొట్టింది. హాస్పటల్ పనుల్లో మనస్సు పనిచేయలేదు. ఎప్పుడు సాయంత్రమవు తుందా అని ఎదురుచూస్తూ కూర్చున్నాను. ఒక్కొక్క నిమిషమే గడిపి సాయంకాల మయ్యేసరికి ఇంటికి రావాలని వెనక్కి తిరిగాను. కాళ్లు నేల మీద తేలిపోతున్నాయి, మనస్సు ఎంతో ప్రసన్నంగా ఉంది. సత్యవాక్ ఇంటిదగ్గరకు వచ్చేసరికి కాళ్ళు వాటంతటవే అగిపోయాయి. దృష్టి తలుపుమీద పడేసరికి అమె లోపలనుంచి వచ్చి తలుపుతీసి, గుమ్మాని కానుకుని నిలబడింది. అమె నోటితో ఏమీ మాట్లాడలేదు. కాని, కళ్ళు మాత్రం హృదయంమీద ఉన్న పొరను తొలిగించాయి. ఆ కళ్ళల్లో ఎంత ప్రేమ! దానితోపాటు స్త్రీలకు సహజమైన సిగ్గుకూడాను! నేను భక్తుణ్ణిలా అయిపోయి—శత్రుదుర్గాన్ని స్వాధీనం చేసుకున్నవాళ్ళు ఎంత ఉత్సాహం గా, సరదాగా గంతులేస్తూ తిరిగి వస్తారో - అలాగే ఇంటికి వచ్చేశాను.

కొన్నాళ్ళు గడిచిపోయాయి. కళ్ళల్లో ప్రేమ ఎంతప్రస్ఫుటమవుతూ వచ్చినా దానివల్ల ఇప్పుడు మనస్సుకు తృప్తికలగటంలా. మంచుబిందు వులతో ఎవరికయినా దాహం తీరుతుందా? తృష్ణ మరింత ఎక్కువవుతూ వచ్చింది. భయసమయంలో అపాయసూచకమైన ఎర్రజండా చూపించి నప్పు డున్నట్లు - మనస్సు ఎంతో అదుర్దాగా ఉండేది. కాని కామదేవుడు ఆ డ్రైవరుకన్న - త్రాగి ఉన్నవాడులాగా లక్ష్యపెట్టేవాడు కాదు. ఈ మద్యం మామూలు మద్యం కాదు. ఇది ధర్మకర్మలను మంటగలిపి మనుష్యుని ఆ భయస్థానానికి తీసుకెళ్ళి దింపే మద్యం. ఇది కామవాంచ అనే మద్యం.

ఒకరోజున రాత్రి చాలా ప్రొద్దుపోయి ఇంటికి తిరిగి వస్తున్నా. ఏదో పెద్ద ప్రమాదం సంభవించినట్లు మనస్సువిచారగ్రస్తమైంది. కాని సావిత్రి గుమ్మంలో నిలబడే ఉంది. నా మనస్సు సంతోషపూరితమై కంఠం గద్గ దికమయింది. నా విచారమంతా దూరమైపోయింది. "ఇవాళ మీకు చాలా అలస్యమయిందే!" అన్నది సావిత్రి.

అలా అనేప్పుడు ఆమె కంఠం వణికింది.

నా గుండె దడదడా కొట్టుకుంది. శరీరమంతా ముచ్చెమటలు పోశాయి. చదువుకునే రోజుల్లో మేము ఎన్నో శవాలని కోశాం. అప్పుడు కూడా ఎన్నడూ ఇలాంటి స్థితి కలగలా నాకు. ప్రత్యవయవం కంపించ సాగింది. నేను ఎంతో కష్టంమీద నన్ను నేను సంబాళించుకుని, "అవు నండీ! కొంతమంది రోగులను చూడటానికి వెళ్ళాను. మీరు గుమ్మంలో నుంచుని ఉన్నారు, ఎవరికోసమైనా ఎదురు చూస్తున్నారా?" అన్నాను.

"ఆఁ. వారికోసం ఎదురుచూస్తున్నాను"

"ఇవాళ ఏదైనా కవిసమ్మేళనం ఉందాఏం?"

"అలాంటిదేమీ లేదు, ఒక సమావేశంలో వారి కొత్తరచనలు చదివి వినిపించటానికి వెళ్లారు?"

"అయితే పన్నెండన్నా కాందే తిరిగి రారేమో"

సావిత్రి తృష్ణాదృష్టితో నాకేసి చూసింది. ఒక మధుర కటాక్షాన్ని విసిరి దీర్ఘంగా నిట్టూర్చి "ఇంట్లో ఉండబుద్ధి పుట్టటంలా" అంది.

"ఇప్పుడు ఎనిమిదే అయింది"

"గడియారం ముళ్ళు తిప్పితే బావుండు ననిపిస్తోంది"

నాకు కాళ్ళు సాగటంలేదు. ఏదో మదురమైన నాటకం జరుగు తున్నట్లుంది కాని యెవరన్నా చూస్తారేమో అని కాలు కదల్చవలసి వచ్చింది. ధర్మాధర్మ విచారం వున్నా లేకపోయినా, అప్రతిష్ఠ వస్తుందేమో అనే భయం వుండకమానదు. సావిత్రి నాకేసి "మీ రింకా గ్రహించనే లేదా?" అన్నట్టు చూసింది.

నేను ముందుకు సాగాను. మనస్సు వెనక్కి పరుగిడుతోంది. అది నా స్వాధీనంలో లేదు. ఇంటికి వెళ్ళాక మనస్సుకు వినగటకలిగింది. సావిత్రి స్వరూపం కళ్లల్లో మెదలసాగింది. ఆమె మధురస్వరం చెవుల్లో మార్మోగసాగింది. నేను ఆమెను మరచిపోవాలని ప్రయత్నించే వాణ్ని. ఈ మార్గంలో అడుగు పెడితే అప్రతిష్ఠ పాలౌతానని భయం వేసేది. అం దరూ నన్ను వేలెత్తి చూపెడతారు. లోకులంతా నన్ను పెద్దమనిషిగా భావిస్తున్నారు. ఈ పని నన్ను సర్వనాశనం చేస్తుంది. లోకులుతెల్లబోయి "యెంత పెద్దమనిషిగా కన్పిస్తేమాత్రం ఏం కేవలం గురుఘంటాలుడైనా" దంటారు. ప్రాక్టీస్ కూడా తగ్గిపోయింది. ఆమె వివాహిత. ఆమెవైపు నేను

చెయ్యిచాచటం చాలా అనుచితం. కాని ఈ యుక్తులు, ఈ ఆలోచనలూ జలబుద్బుదాలలాంటివి. యెంతో త్వరగా నశించేవి. పిల్లగాలివచ్చి వాటిని ఒక్క చెంపదెబ్బ కొట్టేది. మళ్ళీ ఆ గుర్తులుకూడా లేకుండా చెరిగి పోయేవి. మనుష్యుడెంత దుర్బలుడు! యెంత పరాధీనుడు!

మర్నాడు నేను సత్యవాణ్ ఇంటికి వెళ్ళాను. కొత్తగా దొంగతనం చెయ్యటానికి వెళ్ళేవాడిలాగా కాళ్ళు తొట్రుపడ్డాయి. ఆ సమయంలో ఆమె హృదయం యెలా దడదడలాడిందో! యెవరూ చూడలేకపోయారు. ముఖంలోని వికారం తొలగిపోలేదు. కాళ్ళు ముందుకు సాగినకొద్దీ, హృదయం వెనక్కి లాగసాగింది. ఒక్క అంగలో సరాసరి లోపలకువెళ్ళాను నేను. నా పెదవులు యెండిపోయాయి.

సత్యవాణ్ నన్ను చూడగానే కుర్చీలోంచి యెగిరిగంతేసి ఆప్యాయనంగా వచ్చి కలుసుకున్నాడు. చాలాసేపు మాట్లాడుకుంటూ కూర్చున్నాం సావిత్రికూడా ప్రక్కనే వుంది. నా కాళ్ళు కేవలం ఆమెమీదనే వున్నాయి. మొదట్లో మామూలుచోరుణ్ణి. కాని ఇప్పుడు బందిపోటుదొంగను. సావిత్రి సంకోచంకూడా వదిలిపోయింది. మాటమాటకీ నవ్వుతూ వుండేది. ఆమె నాకేసి చూడటానికి సంకోచించేది కాదు. లజ్జాస్థానంలో చాపల్యంవచ్చి ప్రవేశించింది. అక్కడినుంచీ లేవగానే ఇంద్రుడి సింహాసనం లభ్యమైతే కలిగేంత ఆనందం కలిగింది. ఆ తర్వాత ఇహ అనివారితమార్గమైంది. పగలు చాలాసార్లు సావిత్రి దర్శనం లభిస్తూవుండేది. రాత్రిళ్ళుకూడా రెండుగంటలు ఆమెదగ్గర కూర్చునేవాణ్ణి. నాకూ సావిత్రికీ కళ్ళల్లోనే మనస్సులు లీనమైనాయి. కాని ఈ విషయం సత్యవాణ్కు తెలియదు. భావనా సముద్రంలోంచి ముత్యాల్ని వెతికి తెచ్చేకవి, సుదూరాలవరకు దృష్టిని పరపగలిగిన క్రాంతిదర్శి అయిన విద్వాంసుడు తనకళ్ళయెదుట జరుగుతున్న సంఘటనను తెలుసుకోలేకపోయాడు. అతడి కవిత్వం ఇతరుల్ని మేల్కొల్పుతుంది: కాని అతడు నిద్రపోతూనే వున్నాడు. ఆ అజ్ఞానియైన యాత్రికుడు నావలో కూర్చుని పచ్చని మైదానాలను యెత్తైన పర్వతాలను చూస్తూ ప్రయాణిస్తున్నాడు. కాని తన నావ వెళ్ళి భయానకమైన కొండరాళ్ళకు తగులుకోపోతోందని యెరగడు పాపం! సత్యవాణ్ క్రమశః తన వినాశాన్ని తానే తెచ్చిపెట్టుకున్నాడు.

## సావిత్రి —

"ఎంత అంతరముంది. మణిరామ్ నేత్రాలు మనస్సులోని అగ్నిని రగుల్కొల్పేవి అతడు దగ్గరకువస్తే - సూదంటురాయిచే ఇనుము ఆకర్షితమైనట్లు - అకర్షితురాల నయేదాన్ని. నోట్లో నాలిక ఉందాలేదా అన్నంత అమాయకుడిలా కన్పించేవాడు. బుల్‌బుల్‌పక్షి పువ్వుచుట్టూ తిరుగుతూ ఆ లేతరెమ్మమీద వాలాలని ఎంత తహతహలాడుతూ ఉంటుందో అతడు నా దగ్గిరకువచ్చి - అలా తహతహ లాడిపోయేవాడు. అతడు దగ్గర లేకపోతే తోచటంలా. ఎప్పుడూ నా సరసను కూర్చుంటే బావుండు నని పిస్తోంది. ఎవరూ నోటిమీదుగా అయితే ఏమీ అనలేదుకాని, ఊళ్లో ఆడ వాళ్ళ కందరికీ తెలిసినట్లు వాళ్ళ చూపులనుబట్టి తెలిసిపోయింది. నాకేసి చూసి ముసిముసి నవ్వులు నవ్వుకునేవారు. అంతేకాదు, ఇప్పుడు వారు కూడా ఈ ఆలోచనలతో సతమతమవుతున్నారు. వారు కవులుకాని మూర్ఖులేంకాదు. అలసులైతే అవచ్చునుకాని అజ్ఞానులుకారు. ఇప్పుడు చేతులు నలుపుకుని పశ్చాత్తాప పడసాగారు, ఎప్పుడు ఉదాసీనంగా ఉండేవారు. రాత్రిళ్లు నిద్రకూడా పోయేవారుకారు. కళ్లల్లో నెత్తురు చిందుతూ ఉండేది. ఆహారపానాదుల విషయాల్లో ధ్యాసే ఉంచటంలా. అప్పుడప్పుడు స్నానంకూడా మానేసేవారు. వారికి భోజనాదులు అమర్చటం మొదలైన బాధ్యతలు ఇప్పుడు నేను పెట్టుకోవటంలా. ఒకప్పుడు ఈ విషయాలే మనస్సుకు సంతోషప్రదంగా ఉన్నా, ఇప్పుడు చాలా విసుగును కలిగిస్తున్నాయి. కొన్నాళ్లకి - ప్రయాగనుంచి ప్రకటితమవుతున్న ప్రసిద్ధ మాసపత్రిక సరస్వతిలో వారిరచన ప్రచురితం అయింది. అది వారిప్రకృతి స్థితికి చిత్రణ నా కళ్ళల్లోంచి నిప్పులు కురవసాగాయి. కోపగించిన ఆడుపులిలాగా వారిదగ్గరకెళ్ళి "ఇదేమిటి ఇలాంటి కవిత్వం రాస్తున్నారిపుడు ?" అని అడిగాను.

వారు నాకేసి - శిలలయినా కరిగేటంత - కరుణాపూర్వక దృష్టితో చూశారు. దుఃఖంలో నిరాశ సంపూర్ణంగా మూర్తీభవించినట్లు ఉన్నారాయన. మెల్లిగా "ఏమిటి ?" అన్నారు.

"ఈ పద్యాలు చదివితే లోకులేమనుకుంటారు ?"

"కవి చూడగలిగిం దేదో వ్రాయగలుగుతాడు. ఇందులో నా దోష మేముంది ;"

నేను కొంచెం వెనక్కి తగ్గి "మీరేం చూశారు ?" అన్నా.

"సావిత్రీ నా ముఖాన్ని కప్పలేవు. నీ పమిటతో నీ ముఖాన్ని కప్పుకో. నాకు తెలియందేమీ లేదు."

నేను కోపంతో "అలా నిందిస్తారెందుకు ?" అన్నాను.

"తిట్లు ఇంతకన్న లక్షరెట్లు నయం."

"అయితే మీకు నా మీద సందేహమా ?"

"సందేహ మయితో దుఃఖించటం దేనికి ? ఇప్పుడింక విశ్వాసం పోయింది. చెవుల్ని మోసగించ వచ్చునుకాని, కళ్ళను మాత్రం మోస గించలేము. నా ఇల్లు ఇలా సర్వనాశన మవుతుందని ఎన్నడూ ఊహిం చలా నేను."

నాకు విపరీతమయిన సిగ్గేసింది. కాని ప్రకృతి ఎక్కడ దురాచారా న్ని ప్రవేశపెడుతుందో అక్కడ ముందు నిర్లజ్జను ప్రవేశపెడుతుంది. నేను "ఏమయితే మీ కెందుకు?" అన్నాను.

"నాకు మరింత కోపాన్ని తెప్పించదలచుకున్నావా ?"

"నా ముఖంకేసి చూడనన్నా చూడరు. ఆ సమయంలో మీ బుద్ధి ఏమయిపోయిందో ?"

"నేను నిన్ను అర్థంచేసుకోలేదు. లేకపోతే ఇవాళ చేతులు నులు ము కోను !"

"కాని లోకులంతా మిమ్మల్ని 'వహ్వా' అంటూంటారు. ఏ పత్రికలో చూసినా మీ కవిత్వ విషయికమైన చర్చే, చదువుకుంటేచాలు సంతోషం కలుగుతుంది."

ఇదివిని వారు నిలబడిపోయారు. అప్పుడు వారికళ్ళల్లో పిచ్చివాళ్ళ కళ్ళల్లో ఉండే ఎరుపు తళతళ లాడింది. "నీవు నీ మృత్యువును పిలిచి తెచ్చుకోకు. నాకు పిచ్చెక్కి పోతోంది" అన్నాడు ఉగ్రంగా.

"అయితే ఏం చంపుతారా ? సరే. అదికూడా కానీయండి మీ వాంఛ పూర్తిచేసుకోండి."

ఆయన నాకేసి - సింహం కనుక తాను చంపబోయే జంతువును ముందు ఒకసారి చూసినట్లు - చూశారు వెంటనే అల్మారుకేసి గంతే

శారు. నా గుండె దడదడలాడింది. పరుగెత్తుకుంటూ వీధిలోకి వచ్చాను. వారు నా వెనకాలె పరుగెత్తుకుని వస్తారని నా ఆలోచన. అంచేత ఇంటి కెదురుగా ఉన్న మైదానంలో నిలబడ్డాను. నాకు మాటిమాటికీ నిట్టూర్పులు రాసాగాయి. మృత్యువు ప్రత్యక్షంగా కన్పించ సాగింది. కాని వారు బైటికి రాలేదు. కాస్సేపయాక వెనకనుంచి 'ధన్' అనే శబ్దం వినిపించింది. నేను పరుగెత్తుకుంటూ లోపలకు వచ్చాను. 'మృత్యుదృశ్యం, చూసి నేను భయపడిపోయాను. కాని నాకు దుఃఖం కలగలా. కోర్టులచుట్టూ కేసుల్తో తిరగవలసి వస్తుందేమో అనే దిగులుమాత్రం కలిగింది.

రెండునెలలు గడిచిపోయాయి. నేను ప్రాంగణంలో కూర్చుని మణిరామ్‌కు నెక్టై అల్లుతున్నాను. నేను లోకాచారాన్ని లెక్కచెయ్యకుండా అతన్ని వివాహమాడటానికి నిశ్చయించుకున్నాను. ఈ వార్త విని లోకులు చమకితులయినారు. కాని నేను ఆయన చనిపోవటానికి సంతోషించాను. జీవితంలో ఆనందం ఇహలభిస్తుందని అనుకున్నాను. హఠాత్తుగా నౌకరువచ్చి 'పోస్టు' తీసుకొచ్చాడు. అందులో ఒక 'ప్యాకెట్' వుంది. ముందు అది ఊడదీశాను. అవి చనిపోయిన నా భర్త తాలూకు కవిత్వ సంచయం. నేను ఒకటి రెండు కావ్యగీతికలు చదివాను. ఎంతవున్నతమైన ఆలోచనాశక్తి! ఎంత పవిత్రమైన భావనా సంపద! ప్రాపంచిక మాలిన్యం సోకదు దానికి. అందులో మోసంకాని, కపటంకాని లేదు. వాటిలో ఆధ్యాత్మిక సుఖమూ, శాంతీ, మాధుర్యం ఉన్నాయి. నా కళ్ళ వెంబడి నీళ్ళువచ్చాయి. చటుక్కన మూడోపేజీమీదికి వెళ్లింది దృష్టి. అది అంకితమున్న పేజీ. నా రక్తనాడులు స్తంభించిపోయాయి. ఆ గ్రంథం నాకు అంకితం ఇచ్చారు. ప్రతిశబ్దంలోనూ ప్రేమ తొణికిసలాడుతోంది. కాని ఈ ప్రేమలోనూ, మణీరామ్ ప్రేమలోనూ ఎంత వ్యత్యాసం ఉంది. ఒకటి చంద్రుని వెన్నెలలాగా ఎంతో చల్లనైనది. మరొకటి అగ్నిహోత్రునిలాగా దగ్ధం చేసేది. ఒకటి సముద్రంలాగా అతిగభీరమైనది. మరొకటి కొండవాగులలాగా వేగవంతమైనది. ఒకటి యదార్థమైనదే - కాని అతి నిశ్శబ్దంగా కన్పిస్తుంది. రెండవది మిథ్యారూపమైనది. గొప్పగా ఉన్నట్లుంటుంది. నా కళ్ళకు కప్పివున్న తెర తొలగిపోయింది. సతీత్వపు శిఖరాంచలాలనుంచి పతనమవటమనేది అనుభవసిద్ధ మయింది నాకు.

లేవబోయేసరికి కాళ్ళు గుదులు కట్టాయి. నేను పుస్తకం మీదనే దృష్టి నిలిపి ఏడవసాగాను.

ఈలోపుగానే మణిరామ్ లోపలకివచ్చాడు. కలుగబోయే ఆనందంతో అతడి ముఖం అరక్తమయింది. అతడి చేతిలో చాలాఖరీదైన పుష్పమాల ఒకటివుంది. నాకోసం దాన్ని బొంబాయినుంచి తెప్పించాడు.అది చూపించ టానికి వచ్చాడు. నేను ఏడుస్తూ ఉండడంచూసి చటుక్కున వెనక్కితగ్గి "ఎందుకు ఏడుస్తున్నావ్?" అన్నాడు.

"ఇవాళ కళ్ళు తెరిచాను నేను."

"ఇదిగో నీకోసం తెచ్చినమాల. రేపే వివాహం."

"ఇంక వివాహం చేసుకోను."

"నీకేమైనా పిచ్చెక్కిందా సావిత్రీ!

"భగవంతుడు నన్నిలా పిచ్చిదాన్ని చేసేఉంచాలి."

మణిరామ్ ముందుకు వచ్చాడు. నేనులేచి వెనక్కివెళ్లాను. తలుపు కేసి సైగచేస్తూ అక్కడే, 'ఆగు' అన్నాను.

ఆరాత్రి నా కెన్నడూరాని నిద్రవచ్చింది. నేను భర్తను తుచ్ఛునిగా వదలివేయ గలిగాకాని, వారి ప్రేమను అలా తుచ్ఛంగా ఎంచి వదలలేక పోయాను. మనుష్యుడు చనిపోయినా అతడి ప్రేమమాత్రం జీవించే ఉంటుంది.

57

# ప్రశ్న....

తెలిమంచు తెర తొలగిపోతోంది. యూకలిప్టస్ చెట్లసందుల్లోంచి ఉషఃకాంతులు తొంగిచూస్తున్నాయి. రోదసీకుహరం సెలయేటిఝుంకారం లాగా ధ్వనిస్తోంది. పుష్పరాగం చల్లినట్లు అరుణకాంతులతో నిండిన మార్గానికి ఇరువైపులా ఉన్న వృక్షపంక్తిచాటునుంచి ఉషఃకన్య మలయ పవనునితో సరాలాగాడుతున్నట్లుంది.

పంచగని శానిటోరియం నిశాదేవి ఒడిలో ఇంకా అచేతనంగా జోగుతూనేఉంది. వీణాదేవిమాత్రం మంచంమీద పడుకుని ఆప్రకృతి శోభను వీక్షిస్తోంది. ఆమె నిన్న సాయంత్రమే ఈ శానిటోరియంలోకి నర్సుగా వచ్చి చేరింది. పదవబ్లాకులో రాత్రి తన డ్యూటీపూర్తి అయ్యాక భోజనం చేయకుండానే వచ్చిపడుకుంది.

శానిటోరియమ్‌లో ఏడు కొట్టారు. ఆధ్వనికి వీణ ఉలిక్కిపడి లేచి దుస్తులు సవరించుకుని పెద్దగది గుమ్మందగ్గరకు వచ్చి నిలబడింది. ఆగదికిరెండువైపులా వరాండాలున్నాయి. ముందరవైపున ఉన్న వరాండలోనే వీణ యింతవరకూ పడుకునిఉంది. గదిలో నాలుగువైపులా నాలుగు మంచాలమీద రోగులు పడుకుని అప్పటికింకా స్వాప్నికవీధుల్లో సంచరిస్తున్నారు.

ఆమె మెల్లిగా వాళ్లను నిద్రలేపి, టెంపరేచర్ చూసి, నాడిపరీక్షించి, తలవైపున వ్రేలాడుతున్న 'చార్ట్' తీసి అందులో నోట్ చేసింది. ఆయా నీళ్లు తీసుకువచ్చి రోగులచేత ముఖాలు కడిగించింది. తర్వాత గది మధ్యగాఉన్న పాలరాతిటేబిల్‌ముందుకు వచ్చి కూర్చున్నారు. వారు నలుగురూ స్త్రీలే. ఒక వైపున వీణకూడా కూర్చుని, వాళ్లు తీసుకుంటున్న ఆహారంచూసి ఆశ్చర్యపడింది. దుర్బలశరీరిణులైనావాళ్లు సునాయాసంగా పట్టెడుపట్టెడు వెన్న, రెండేసి గుడ్లూ, రెండేసి రొట్టెలూ అర్ధశేరు పాలూ పుచ్చుకుంటున్నారు. వీణ ఒక్కపాలు మాత్రమే తీసుకుంది.

"మీరెన్నాళ్లనుంచీ ఉంటున్నారిక్కడ?" అని ప్రశ్నించింది వీణ.

"మూడేళ్లనుంచి... కానీండి, మా బ్లాక్‌లో ఇదివరకుంటున్న నర్సు మీఅంత గంభీరురాలు కాదునుమండీ" అన్నది వారిలో ఒకతె.

వీణ ఆ మాటకు అడ్డువచ్చి, "బాగుంది ఆమె యిక్కడ చాలా రోజులున్నమనిషికాదూ. నేనునిన్ననేగా కొత్తగావచ్చాను. కొన్నిపరిస్థితులు మీవల్లకూడా తెలుసుకోవాలి మీరునలుగురూ ఒక్కగదిలోనే ఉన్నారేం? అటువైపు కొండదగ్గిర ఉన్నబ్లాకులో గదికి ఒక్కొక్కరేగే ఉన్నారు." అంది.

"ఇక్కడ వున్నందుకు, భోజనానికీ, చికిత్సకూ అన్నిటికీ కలిపి మేం ఒక్కొక్కళ్లం నూటయాభైరూపాయలు చెల్లిస్తున్నాం. వారు ఏడేసి వందలు చెల్లిస్తున్నారు. మేం పేదవాళ్లం. అంతంత చెల్లించాలంటే ఎక్కడనుంచితీసుకురాగలం?" అన్నది ఒకామె పాడుగ్గానిట్టూర్చి...

"నీకు కొంచం ఆరోగ్యంచిక్కినట్లుంది. నువ్వింకా వెళ్లలేదేం ఇక్కడ నుంచి? పాపం! వీళ్లుముగ్గురూమాత్రం దుర్బలంగావున్నారు!"

"నాకయినాబాగా ఆరోగ్యం కుదరలా జ్వరమయితే రావటం లేదు కాని, ఇంకా దగ్గువస్తూనేవుంది. కేవలం ఈ వాతావరణాన్నిబట్టి ఆమాత్రం గానయినా వున్నాను... మేము తీసుకుంటున్న ఈ ఆహారం చూసి మీ రాశ్చర్యపడుతున్నారా?"

"ఎబ్బేలేదండీ!" అన్నది వీణ సంకోచిస్తూ,

"మీరబద్ధం ఆడుతున్నారు. నేను చెబుతున్నానుగా ఇది మాభోజ నానికి కేవలం ప్రారంభోపహారంలాంటిదే. తొమ్మిదింటికి మళ్లీపాలు, పదింటికి అన్నం పప్పు, రెండు మాంసంకూరలూ. మూడింటికి వెన్న-రొట్టి, గుడ్లు,కేక్; ఆరింటికి మళ్లీమాంసం-రొట్టె, ఎనిమిదింటికి పాలూ-పూరీ వారానికి ఓసారి కోడిపలావ్." అన్నది. వీణ తెల్లబోయి అలాగే చూస్తూ నిలబడిపోయింది

●

సందెచీకటి ఇంకానాలుగువైపులా వ్యాపించలేదు. శానిటోరియమ్‌కు వెలుపలచిన్నచిన్న బంగాళాలు కొత్తవి తయారవుతూ ఉన్నాయి. వీణ వాటినిచూస్తూ వెడుతోంది. పదిపదిహేనురోజులకే ఈశానిటోరియం అంటే ఆమెకు విసుగెత్తిపోయింది. ఆమె కన్నిటికన్నా అశ్చర్యం కలిగిస్తున్నదేమి

టంటే-వీళ్ళుమృత్యుముఖంలో ఉన్నా జీవితంలో శృంగారమే సర్వస్వమూ అని భావిస్తారేమో అని! ఆ శానిటోరియమ్‌లో రోగులూ, నర్సులూ, డాక్టరూ చాలాభాగం అంతాపార్శీలే. దిగజారిపోయిన యవ్వనంతో ఒకమూల రోగ పీడితులైఉన్న ఆ స్త్రీలహావభావాలూ, శృంగారవిషయికమైన హేయప్రసంగాలూ, ఆ ఆలోచనలూ చూస్తున్నకొద్దీ ఆమె కేవలం సంకుచితురాలు కావటమేకాదు, విరక్తి అసహ్యాలతో విముఖురాలైంది. చిన్నప్పటినుంచి ఏశృంగారచేష్టలుచూసి, ఏప్రసంగాలువిని, ఏసంసర్గంనుంచి దూరంగా ఉండాలని తప్పించుకు తప్పించుకు తిరుగుతోందో - ఏ విషయాలంటే విసుగెత్తిపోయి, ఈనర్సు జీవితాన్ని వరించిందో - ఆ జీవితమార్గంలో ప్రవేశించినా ఇలాంటి ఇబ్బందులు ప్రత్యక్షమవుతూ వుండేసరికి ఆమె హతాశురాలుకావటమేకాదు ఆమెకు విరక్తికూడా ఏర్పడింది.

అర్ధచైతన్యంలో ఆమె ముందుకు సాగిపోతోంది. ఏదో ఒక కోమల స్పర్శతో వెనక్కితిరిగింది. "నువ్వునానుంచి దూరంగావెళ్లి పోవాలనుకుంటున్నావా వీణా. కాని అది మన అదృష్టదేవతకు ఇష్టంలేదు, ఆమె మనల్ని బంధించాలని చూస్తోంది. దానికి నువ్వేమంటావు?"

"అదృష్టదేవత పరిహాసమిది. మీరిక్కడ కెప్పుడు వచ్చారు?"

"కొద్దిరోజులయింది. ఇంకా నేను చార్జీపుచ్చుకోలేదు."

"ఛార్జీ ఏమిటి?"

"నేనిక్కడికి డాక్టరుగా వచ్చాను."

"చాలా పొరపాటుచేశారు నళినీబాబూ!"

"ఏం ?"

"క్షయఎలాంటి వ్యాధి అంటే—" సంకోచంతో ఆమె ఇంకమాట్లాడలేక పోయింది.

"అది నీకుమాత్రం హానికరంకాదా ? అభయం వుంటే మరినువ్వు మాత్రం ఇక్కడికెందుకు వచ్చావ్?"

"నేను కొన్ని కారణాలవల్ల వచ్చానిక్కడికి. కాని మీకుఅలాకాదు."

"అలా కాకపోవటమేమిటి? నువ్వెక్కడుంటే నేనూ అక్కడే. ఇది కొత్త సంగతేంకాదు వీణా!"

"కాని ఇందువల్ల లాభమేమీలేదు. నేనుమళ్లీ మరోసారి చెబుతున్నాను. మీరిలా నావెంట పడకండి—నమస్తే ..."

"ఇదిగో విను... నేనునిన్ను మరిచిపోలేను వీణా?" నళిని ఆమె ఎదటికి వచ్చి నిలబడ్డాడు.

"నేను మన్నించెబుతున్నాను. మీరు పొరబాటుచేస్తున్నారు. ఇది అసంభవం." అని సమాధానంకోసం ఎదురుచూడకుండానే వీణ అక్కడి నుంచి వెళ్లిపోయింది.

●

నళిని ఎక్స్‌రేఫొటో చూస్తూ "జీవితమంతా నువ్వు నిగూఢంగానే ఉంటావా?" అన్నాడు.

వీణ మరోఫొటో అతడి ముందరపెడుతూ "ఆ సంగతుల్ని అలా పోనిద్దురూ నళినీబాబూ! మీపనిమీద శ్రద్ధవహించండి మీరు." అంది.

"ఉహూఁ అలాకాదు. నువ్వునాకుభార్యవి, సహధర్మచారిణీవికావాలి. ఆశుభదినం ఎప్పటికయినారానీ దానికోసం ప్రతీక్షిస్తూ వుంటాను. జీవితమంతా అయినాసరే..."

"అది అసంభవమన్న సంగతి మీకూతెలుసు. అయినామాటిమాటికీ ఆప్రసంగంఎత్తి నాకు దుఃఖాన్ని కలిగిస్తారెందుకు?'

"నామాటలకు నువ్వుబాధపడుతున్నావా?"

వీణ నిరుత్తరురాలై ఫొటోమీదికి వంగి "ఇది చూడండి" అంది.

"చూస్తున్నా బొంబాయిలో నువ్వూనేనూ కలిసి కాలేజిలో చదువుకుంటున్నప్పటినుంచీ నువ్వు నా ప్రయత్నాల నన్నీ వ్యర్థంచేస్తూనే వచ్చావు. నువ్వెవరివో పూర్తి నీపరిచయం కలగచేశావుకాదు. నాకు పత్నివవటానికే అంగీకరించావుకాదు.

నువ్వునన్ను కాంక్షిస్తున్నావని నాకు బాగాతెలుసు. నానుంచిఎడంగా వుండాలని అనుకుంటున్నావనీ తెలుసు. ఇది నిగూఢత్వంకాకపోతే మరేమిటి?"

"నేనెవర్నో ఇంతకన్న ఎక్కువ పరిచయంచెయ్యలేను"

"అదేం?"

"కొన్నికారణాలవల్ల. నేను మీనుంచి దూరంగా వుండాలనికూడా వాంఛిస్తున్నాను."

కొంచంసేపు ఆలోచించిన మీదట వ్యథితకంఠంతో "నువ్వునన్ను వివాహంచేసుకోవటానికి ఇష్టపడటంలేదని ఇప్పుడుపూర్తిగా గ్రహించాను.

మిత్రులకు సాధారణంగా వుండే అధికారాన్ని పురస్కరించుకుని ఒక మాట అడుగుతున్నా, దానికైనా సమాధానం యివ్వవా?'' అన్నాడు.

"చెప్పండి?"

"ఇలా అవివాహితగా ఎన్నాళ్లుంటావ్? పెళ్లి ఎటూచేసుకుతీరాలి ఆ అదృష్టవంతుడిపేరు నేను వినవచ్చా?"

"నేను పెళ్లి చేసుకుతీరతానని మీరునిశ్చయంగా గ్రహించారా"

అతడి పెదవులమీద అణచుకున్న నవ్వు నాట్యంచేసింది.

తప్పకుండా చేసుకుంటావు. తల్లితండ్రులులేని హిందూకన్య ఎన్నాళ్ళు ఒంటరిగా వుండకలదు? వీణముఖం విన్నబోయింది.

"యిదేనా మీ ప్రశ్న ?"

"ఆఁ"

నేను ఈప్రశ్నకు సమాధానం యివ్వలేను "అన్నది ఆమె మెల్లగా ఆమె అశ్రువులను సంబాళించుకోపోయింది. తనమీద తనకే కోపం వచ్చింది. స్వశక్తిమీద ఆధారపడదలచుకున్న ఆమెకు, యిలాంటి దౌర్భల్యం శోభించదు.

"నేను యిక్కడపని వదిలేస్తున్నాను'' అంది. ఆమె కంఠస్వరం సహజంగాను స్థైర్యంగానూ కూడా వుంది.



ఏడోనెంబరు బ్లాక్‌లో కోలాహలం బయలుదేరింది. క్రొత్తగా వచ్చిన రోగిష్టి సుందరి ధరించిన వస్త్రాలనూ, ఆమె ఆభరణాలనూ విలువైన ఆమె సామానును చూడటానికి ఆ శానిటోరియమ్‌లో ఉన్నవాళ్లంతా రోగులతో సహా అక్కడికి చేరుకున్నారు. ఒకరు ఆమె రాణీగారు అంటే మరొకరు ఆ మాటకు అడ్డువచ్చి, హిందూవనిత కాదు, ముసల్మాన్ స్త్రీ బేగమ్ అయి వుంటుంది. ఇలా వాద వివాదాలు చెలరేగిపోతున్నాయి. ఆమె సౌందర్య ప్రశంసకూడా వారి మాటల్లో మధ్య మధ్య వ్యక్తమవుతునే వుంది. ముప్పైఅయిదు, ముప్పైఆరేళ్లున్న స్త్రీ అయినా చిన్నదానిలా కన్పిస్తోంది. శరీరచ్ఛాయ చూస్తే కేవలం గులాబీవర్ణమే.

మఖమల్ పరుపుమీద పడుకుని ఉంది ఆ స్త్రీ. మరో ఇద్దరుముగ్గురు స్త్రీలు ఎదురుగా ఉన్న వరండాలో కూర్చుని ఉన్నారు. బహుశా వారు

ఆమె దాసీలై ఉంటారు.... ఏమయినా వ్యాధి ఆమెను శుష్కింపచేసింది. కష్టాలూ దుఃఖాలూ ఆమె సుందర దేహాన్ని నాశనం చేసేశాయి. అయినా విశాలమైన ఆమె నేత్రాల్లోని, అలసదృష్టి ఆమెఅంతర్యాన్ని మూర్తీభవింప చేస్తోంది— ఆ అంతర్యం, అహంకారమూ, భోగలిప్స, ఉచ్ఛృంఖలత మొదలైనవాటితో నిబిడీకృతమై ఉంది. కొంతమంది నర్సులూ డాక్టర్లతో పాటు నళినికూడా రోగి 'రిపోర్టు' తీసుకోవటానికి అక్కడికి వచ్చి చేరాడు.

ఆమె పడుకుని ఉన్న మంచంమీద దృష్టిపడగానే ఆతడులిక్కి పడ్డాడు.

"నువ్వా? హీరాబాయి! నువ్వా?" అని ఆశ్చర్యంతో అడిగాడు నళినీ బాబు. ఆ గదిలో ఉన్నవాళ్లంతా చకితులయ్యారు. ఎందువలనంటే ప్రసిద్ధురాలైన హీరాబాయి పేరు వారంతా అదివరకే విని ఉన్నారు.

ఆ మూలనున్న బీరువాకు ఆనుకుని వీణ తను పడిపోకుండా ఆపుకుంది.

"ఆఁ. నేను జబ్బు పడ్డాను బాబూజీ! ఇక్కడ క్షయవ్యాధికి చికిత్స చేస్తారని విని వచ్చాను. కాని ఇప్పుడు పశ్చాత్తాపపడుతున్నాను. నేను పొరబాటు చేశాను. ఆయన నన్ను భువాలీ శానిటోరియంకు వెళ్లమని చెప్పారు. కాని ఇది పంచగని. మరేనష్టంలేదు: రేపో ఎల్లుండో ఇక్కడ నుంచి వెళ్లిపోతాను. మీరు ఇక్కడే ఉంటున్నారా ఏం?'

'నేను ఇక్కడికి డాక్టరుగా వచ్చాను'

ఇంతసేపయక హీరాబాయి వీణను చూసింది. నళిని మధ్యలోఅడ్డు రాకున్నట్లయితే ఒకర్నొకరు వాళ్లు ఇద్దరూ విహ్వలదృష్టితో చూసుకుంటూనే ఉండిపోయేవారు.

'నువ్వు వీణను ఎరిగున్నావా?' అని ఎంతో పట్టుదలతో అడిగాడు నళిని.

"వీణా ? వీణా ? ఇప్పుడింత పెద్దదయిందా ? ఆ వీణే ? ఉహూఁ. ఉహూఁ. నేను ఈమెను ఎరగను' అని ఆమె రెండుచేతులతో ముఖం కప్పేసుకుంది.

కొంతసేపు వారిద్దర్నీ శ్రద్ధగా పరిశీలించినమీదట నళిని వీణవగ్గిర కెళ్ళి నిలబడి 'నువ్వు ఇంకా నిన్ను దాచుకోవాలనే అనుకుంటున్నావా ?' అన్నాడు తననుతాను మరిచిపోయి.

"అంటే?"

"నువ్వు వేశ్యాపుత్రికవంటే నేను పొరబాటుపడ్డవాణ్ణవుతానా?"

"మీరు నా నుంచి కోరుతున్నదేమిటి అసలు?"

"ఏమీలేదు" అని నళిని అసహ్యాభావంతో "ఒకవేశ్యాపుత్రిక వివాహ బంధవంనుంచి ఆ పరమేశ్వరుడు నన్ను తప్పించినందుకు ఆయనకి ధన్యవాదాలర్పిస్తున్నాను" అన్నాడు.

వీణ భయవిహ్వలమైన నేత్రాల్ని విప్పార్చి, "ఇంతే? ఈ ప్రేమ బలంతో నేనా నాకు భర్తనవుదా మని వెంటబడి వచ్చారు? మీ రెంత వరకు పాపం వీళ్ల కుతూహలాన్ని ఇలాంటి ఆనంద చర్చతో చరితార్థం చేస్తూ ఉంటారో అంతవరకూ నేను హీరాబాయి విషయమై చూస్తూ వుంటాను"

"అయితే ఇంతకీ నన్నే వేశ్యాపుత్రిని వివాహం చేసుకోమంటావా?"

"అలా చేసుకోండని నే నెప్పుడు చెప్పాను? కాని నే నొక్క ప్రశ్న మాత్రం అడుగుతున్నా. మీలాంటి వ్యక్తులుకూడా అసహ్యించుకునేటంత ఈర్ష్య వహించటానికి ఆ వేశ్యాజాతి ఎలా వుద్భవమైందని?"

"వీణా! ఆమె నిజంగా నీ తల్లేనా?" నళినిప్రశ్నకు ఆమె జవాబివ్వ తలచుకోలేదు.

"మీరు నా ప్రశ్నకు సరియైన సమాధానం ఇవ్వగలిగినప్పుడే మీకు నా యథార్థవిషయం తెలియచేసేది"

అతడు అలాగే నిలబడి ఆలోచించసాగాడు. కొంతమంది స్త్రీల కుతూహలదృష్టి వారిమీద ప్రసరించి వున్నాయి. వీణ చేతనారహితమై హీరాబాయి ముఖంమీద నీళ్లు చిలకరిస్తోంది.

●

# వారివారి అదృష్టాలు!

కాస్సేపు ఊరికే తిరిగితిరిగి రోడ్డుప్రక్కన సిమెంటు బెంచీమీద కూర్చున్నాం.

నైనిటాల్‌లో సాంధ్యకాంతులు సన్నగిల్లుతున్నాయి. ఆవిరితో అలుముకున్న మేఘాలు దూది పింజలులాగా—మా తలల మీదనుంచి రాచుకుంటూ పోతున్నాయి. సంధ్యాకాంతులు క్రమ్ముకున్న ఆమేఘశకలాలు కాస్సేపు ఎర్రగాను, మరికాసేపు తెల్లగానూ మారి పోతున్నాయి.

మా వెనుకవైపున విశాలమయినపోలోమైదానం. ఎదురుగా సుశ్రావ్యమైన సంగీత వాద్యాలతో మార్మ్రోగుతున్న మనోహరమైన యూరపియనుల బంగాళా, ప్రక్కనే సుందరతమమైన నైనిటాలూ.

సరస్సులోని చిన్నచిన్న నావలు తెల్లటి తెల్లని తెరచాపల నెత్తుకుని, ఒకరిద్దరు తెల్లవారలనెక్కించుకొని ఈఒడ్డుకూఆఒడ్డుకూతిరుగుతున్నాయి. కొంతమంది యూరోపియనులు తమతమ డింగీలలో ఒక్కొక్క ఆంగ్లేయ స్త్రీని ఎదురుగా కూర్చోపెట్టుకుని పందాలువేసుకున్నట్లు ఒకరికన్న ఒకరు గబగబాముందుకు తోసుకుపోతున్నారు. కొంతమంది గాలాలను నీళ్లలో వదిలి ఒడ్డునకూర్చుని, చేపలుపట్టటంలో నిమగ్నులై ఉన్నారు.

వెనకవున్న పోలోమైదానం ప్రక్కనే పిల్లలు కేరింతాలు కొడుతూ ఆడుకుంటున్నారు.

కొట్టుకోవటం, తిట్టుకోవటం, అల్లరి—యివివాళ్ల ఆటల్లో ప్రధానాంశాలు. వాళ్లకు ముందూవెనుకా అన్న చింతలేదు. తాత్కాలికమయిన వుత్సాహాతిశయాలే వాళ్లకు సర్వమూ. సంపూర్ణమయిన సత్యజీవులువాళ్లు.

రోడ్డుమీద వచ్చేపోయే స్త్రీపురుషులకు అంతూపంతూలేదు. ఈజన ప్రవాహం ఎక్కడనుంచి ప్రారంభమై ఎక్కడికి చేరుకుంటుందో ఎవరు చెప్పగలరు? చిన్న పెద్ద అనే భేదంలేకుండా రకరకాలవయస్సులవాళ్లూ వున్నారు. వాళ్లల్లో. మానవులలోని నమూనాలనన్నీ సంతలోకి తీసుకువస్తే నడుస్తున్నట్లున్నారు.

అధికారగర్వంతో విర్రవీగే యూరోపియనులూ, తమగౌరవమర్యాదలను నాశనంచేసుకుని, అధికారులు చెప్పినట్లల్ల తోకఆడించటానికి అలవాటుపడ్డ కొండజాతులవాళ్లూ చిరిగిపోయిన గుడ్డలతో గుర్రాలకళ్లాలను పట్టుకొని నుంచున్నారు.

ఆడుకుంటూ, అల్లరిచేస్తూ, గంతులేస్తూ పరుగులుపెడుతున్న తెల్లవాళ్లపిల్లలూ, వాళ్ళకేసిదిగాలపడిచూస్తూ-తమతమతండ్రుల వేళ్ళుపట్టుకుని నడుస్తున్న భారతీయుల పిల్లలూ వున్నారక్కడ.

ఆయూరోపియన్ తండ్రులు తమ పిల్లలతోపాటు పరుగెత్తుతున్నారు కేరింతాలూ కొడుతున్నారు. భారతీయులైన తండ్రులు తమ ఐశ్వర్యాన్ని హెూదానీ వెల్లడిచేసుకుంటూ నడుస్తున్నారు.

ఆంగ్లస్త్రీలు :మెల్లిగా అడుగుల్లో అడుగులు వేసుకుంటూనడవకుండా గబగబానే నడుస్తున్నారు. అలానడవడంవల్ల వారికి అలుపుఅనేది, లేదు. పిల్లలతోపాటు నవ్వుతూ కేరింతాలు కొట్టటానికి సిగ్గుపడటమూ లేదు వాళ్లు. కనరత్తుకోనం గుర్రపుస్వారీ అయినా చేయగలరు - అప్పుడప్పుడు బుద్ధిపుడితే కొరడాలుతీసుకొని గుర్రాలతో హిందుస్తానీవాళ్లను బెదిరించనూ గలరువాళ్లు. ఇద్దరిద్దరూ, ముగ్గురుముగ్గురూ, గుంపులుగుంపులుగా నిశ్శంకంగా, నిర్భయంగా వాళ్ల గమ్యస్థానానికి చేరుకుంటూ ఆరోడ్డువెంటే నడుస్తున్నారు.

అక్కడ మనభారతీయ గృహలక్ష్మలు ఆరోడ్డుకు ఒక ప్రక్కగా తమ పమిటకొంగులను బిగపట్టుకుని, అచీరెమడతల్లో లోకోత్తరమైనసిగ్గు, స్త్రీత్వం, భారతీయుల ఉత్కృష్టాదర్శాన్ని తమ చుట్టూ నంరక్షించుకుంటూ భయభయంతో నేలచూపులు చూస్తూ ఒకొక్క అడుగే వేసుకుంటూ వెడుతున్నారు,

వీరితోపాటు మరొకరకం భారతీయులుకూడాఉన్నారు. వాళ్ళుస్వదేశీయులనుచూస్తే ఈసడించుకుంటూ ఆంగ్లేయులంటే ఆదరాభిమానాలు చూపుతూ వారుచెప్పినట్లల్లా తోకఆడిస్తూ ఉంటారు. భారతభూమిని పరిపాలించే అధికారమేదో వారికి లభ్యమైనటు నగర్వంగా నడుస్తున్నారు.

గంటలకు గంటలుగడచిపోతున్నాయి. అంధకారం బాగా అలుము కుంటోంది. చిన్నచిన్న మేఘాలన్నీ మంచుతో తెలుపెక్కిపోతున్నాయి. జనసంచారం క్రమంగాక్షీణిస్తోంది. ఒకళ్లోయిద్దరో గొడుగులువేసుకుని నడిచి పోతున్నారు. మేం అక్కడివాళ్లం అక్కడేకూర్చున్నాం. బాగాచలి వేస్తోంది మేమువేసుకున్న ఓవర్ కోట్లు మంచుతో తడిసిపోయాయి.

వెనక్కితిరిగి చూస్తే ఆరోడ్డంతా మంచుగడ్డలాగా నున్నగా నిశ్చలంగా కనిపిస్తోంది.

అంతానిశ్శబ్దంగాఉంది. సరస్సులలో ప్రతిఫలిస్తున్న విద్యుత్ కాంతులు దీపమాలికల్లాగా ప్రకాశిస్తున్నాయి. ఆ కాంతులు ఒకటిరెండు మైళ్లవరకూ వ్యాపించి ప్రకృతినంతా జలదర్పణంలో ప్రతిబింబింప చేస్తున్నాయి. అలలతో ఆదర్పణాన్ని కంపింపచేస్తూన్న ఆజలప్రదేశం ప్రతిబింబాల్ని వెయ్యిరెట్లుచేస్తూ ఆకాంతులనన్నింటినీ ఒకచోట రాశీ భూతం చేసి వ్యాపింపచేస్తున్నటుంది. పర్వతశిఖరాలమీదికి వ్యాప్తమైన కాంతులు నక్షత్రాలలా ప్రకాశిస్తూన్నాయి.

మేముచూస్తూచూస్తూ ఉండగానే ఒక తెరవచ్చి వీటినన్నిటినీ కప్పివేసింది. ఆకాంతులన్నీ లుప్తమయిపోయాయి నల్లగాభూతాలలా ఉన్న ఆపర్వతాలుకూడా ఈ తెల్లటి తెరమాటున మణిగిపోయాయి:

ప్రక్కనున్న వస్తువుకూడా కన్పించటంలా. ఇదేదో ఘనభూతమైన మంచుప్రళయంలాతోచింది. మహాసముద్రం పొంగిపొరలి ఈసృష్టినంతా ముంచెత్తినట్లు- ఆ మంచుప్రళయంలో అంతాముణిగి పోయినట్లనిపించింది. అన్నివైపులా నిర్భేద్యమైన తెల్లని శూన్యత్వంవ్యాప్తమయింది.

ఇలాంటి పొగమంచు మేమెప్పుడూచూడలా. ఆమంచువర్షంలా టపటపబొట్లురాలసాగింది,

ఆరోడ్డు నిర్జనంగా నిశ్శబ్దంగాఉంది. ఆజనప్రవాహమంతా ఎక్కడకుపోయి దాక్కుందో ఏమో మరి.

ఆశూన్యంలోంచి ఎక్కడో దూరంగా పదకొండుగంటలు కొట్టినట్లు వినిపించింది. మేము మా హొటళ్లకు బయలుదేరాం.

దారిలో మాతో ఉన్న మిత్రులహోటలు కనిపించింది. వకీళ్లు ఆయిన ఆమిత్రులిద్దరూ అందులోకి వెళ్లిపోయారు. మేమిద్దరమూ ముందుకు సాగాం. మా హోటల్ ఇంకాపైన ఉంది.

ఆ సరస్సుఒడ్డునే పడినడుస్తున్నాం మేము. మా ఓవరుకోట్లు తడిసి ముద్దలయాయి. ప్రత్యేకం వర్షంకురుస్తున్నట్లేలేదు. కాని అక్కడ వీస్తున్నగాలిలో అణుఅణువునా వర్షమున్నట్లే ఉంది. ఈకోటుమీద ఇంకో కంబళి కప్పుకుంటే బాంగుడుననిపించేటంత చలిగా ఉంది. దారిలో సరస్సు అంచనే ఒకబెంచీఉంది. నామనస్సు అంతా చీకాకుగా ఉంది. చప్పున హోటల్ చేరుకుని, ఈతడిసిన గుడ్డలుతీసేసి, వెచ్చటిపక్కమీద ముసుగెట్టుకుని పడుకుందామని అనుకుంటున్నా. కాని పక్కనున్న మామిత్రుడి ఆశ ఎప్పుడెలాఉంటుందో ఎలాఊహించగలం! "రావోయీ కాసేపు ఇలా కూర్చో" అన్నాడతడు మెముఅపాగమంచులో రాత్రిఒంటి గంటదాకా ఆసరస్సుఒడ్డున తడిసిముద్దై మంచుగడ్డలా ఉన్న ఆ యినప బెంచీమీద కూర్చున్నాం. పది, పదిహేను నిమిషాలయింది. మిత్రుడు లేచేఎత్తేమీ కనుపించలా. నేను మండిపడుతూ 'వెడదామా?' అన్నాను.

"అరే కాసేపు కూర్చోవోయ్!" అన్నాడు.

చెయ్యిపట్టుకుని బలవంతంగా కూర్చోపెట్టేసరికి గత్యంతరంలేక కూర్చోవలసివచ్చింది. అతడి ఆసక్తిని కాదనితప్పించుకోటమూ సులభం కాదు. అలా అని అక్కడ కూర్చోటమూ అంతతేలిక కాదు.

మెదలకుండా కూర్చుని, లోలోపల మండిపడుతున్నా. ఇంతలో మిత్రుడు హఠాత్తుగా, "చూడు అదేమిటి?" అన్నాడు.

నేను అటుకేసిచూసేసరికి, ఆపాగమంచు తెలుపులోనించి, అల్లంత దూరంలో ఒకనల్లని స్వరూపం మావైపున నడిచివస్తున్నటుంది. "ఏదో అయిఉంటుంది" అన్నా

రెండు మూడు గజాలదూరంలో, ఒక కుర్రవాడు తలగోక్కుంటూ నడిచివస్తున్నాడు. తలమీద ఆచ్ఛాదనాలేదు. కాళ్లకూలేదు ఆచ్ఛాదన. మాసి

పోయినచొక్కామాత్రం ఒంటిని వేలాడుతోంది

వాడికి అడుగులు ఎలాపడుతున్నయో, యెక్కడికి వెళ్లాలనుకుంటు న్నాడో, యెక్కడికి వెడుతున్నాడోకూడా తెలియదు.

దగ్గరలో ఎక్కడనుంచో వస్తున్న లాంతరు వెలుతురులో చూశా. వాడికి పదేళ్లుంటాయి. ఎర్రగానే ఉన్నాడు. కాని మురికితో నలుపెక్క పోయాడు. కళ్లు శూన్యంగా కన్పిస్తున్నాయి! తల యింకాఅలాగోక్కుంటూనే వున్నాడు.

వాడుమమ్మల్నిచూడలేదు. మమ్మల్నేకాదు: అసలువాడు కింద నేల కాని, పైన నాలుగువైపులా వ్యాపించిన పొగమంచునుకాని, ఎదురుగా వున్న సరస్సునుకాని, తక్కిన ప్రపంచాన్నికాని, ఏమీచూడటంలా. తన విలక్షణవర్తననుమాత్రమే చూచుకుంటున్నాడు.

"ఏయ్!" అని కేకేశాడు మిత్రుడు.

వాడేదో మేల్కొన్నట్లుమాని, దగ్గరకువచ్చాడు.

"నువ్వెక్కడకి వెడుతున్నావురా?"

వాడు తన శూన్యదృక్కులను విస్ఫారితంచేశాడు.

"ప్రపంచమంతా పాటుమణిగితే నువ్వెందుకురా ఇలా తిరుగు తున్నావ్?"

వాడు మౌనంవహించాడు. అయినా ఏదో మాట్లాడేవాడులానుంచుని వున్నాడు.

"ఎక్కడ పడుకుంటావ్?"

"ఇక్కడే, ఎక్కడో?"

"నిన్న ఎక్కడ పడుకున్నావ్?"

"దుకాణంలో."

"ఇవాళ అక్కడ ఎందుకు పడుకోలా?"

"నౌకరీనుంచి తొలిగించారు."

"ఏం నౌకరీ వుండేది?

"అన్ని పనులూ చేసేవాడ్ని. ఒక రూపాయిచ్చి ఎంగిలికూడు పడేసేవాళ్ళు."

"మళ్లీ నౌకరీ చేస్తావా?"

"ఆఁ."

"ఇవాళ ఏంతిన్నావ్ ?"

"ఏం తినలా."

"ఇప్పుడు తింటానికి ఏమయినా దొరుకుతుందా ?'

"దొరకదు."

"అయితే ఇలాగే పడుకుంటావా ?"

"ఊఁ."

"ఎక్కడ ?"

"ఇక్కడే." ఎక్కడో

"ఈ గుడ్డలతోనే ?"

వాడు కళ్ళతో మౌనంగా సమాధానంచెప్పి నుంచున్నాడు. "ఎంత మూర్ఖప్రశ్న ?" అంటున్నట్లున్నాయి కళ్ళు.

"తల్లీ తండ్రీ ఉన్నారా ?"

"ఉన్నారు."

"ఎక్కడ ?"

"ఇక్కడికి పదిహేనుకోసుల దూరంలో వున్న పల్లెటూళ్లో."

"నువ్వు పారిపోయివచ్చావా?"

"అఁ."

"ఎందుకని?

"నాకింకా తమ్ముళ్లూ చెల్లెళ్ళూ వున్నారు- వాళ్ళూ పారిపోయి వచ్చారు. అక్కడ పనిలెదూ తిండీ దొరకదు. మాఅయ్యా ఆకలితో బాధ పడుతూ కొట్టేవాడు మాఅమ్మకూడా అలాగే ఇదవుతూ ఏడుస్తూ వుండేది. అందుకని పారిపోయివచ్చాం. ఇంకో సొవానగాడుకూడావున్నాడు. ఆఊరి వాడే, నాకంటె పెద్దవాడు. మేమిద్దరం కలిసివచ్చాం ఇక్కడెకి. వాడిప్పుడు లేడు'

"ఏమయిపోయాడు?"

"చచ్చిపోయాడు."

ఇంతచిన్న వయస్సులోకూడా వాడికి చావంటే ఏమిటో తెలిసింవే అని నాకు అశ్చర్యంవేసింది. బాధకూడా కలిగింది. ''చచ్చిపోయాడా?'' అని అడిగా.

''అఁ. యజమాని కొడితే చచ్చిపోయాడు.''

''సరే. మాతోకూడారా.''

వాడ్ని వెంట పెట్టుకుని మేముమళ్లీ వెనక్కి అప్లీడరు స్నేహితులున్న హోటల్‌కివచ్చాం'

ప్లీడర్లు యిద్దరూ మేడమీదనుంచి దిగివచ్చారు. కాశ్మీర్ శాలువలు కప్పుకున్నారు. వాళ్లకు బూట్లుమేజోళ్ళూ వున్నాయి. కంఠస్వరంలో నిర్లక్ష్యం కనిపిస్తోంది.

ఓహో! మీరా?-ఎందుకోచెప్పండి!''

''మీకో నౌకరు కావాల్సిన అవసరం వుందికదూ! చూడండి ఈ కుర్రాడు ఒకడున్నాడు''

''ఎక్కడనుంచి తీసుకువచ్చారు. వీడ్ని మీరెరుగుదురా.''

''ఎరుగుదుము. వీడు టక్కరివాడేంకాదు.''

''ఈ కొండజాతులువాళ్ళు ఒట్టిసైతానులండీ! చిన్నప్పుడు అలక్షణాలు పైకికన్పించవు. మీరుకూడా చాలాచిత్రమైన మనుష్యులు. ఎక్కడినుంచో పట్టుకువచ్చి నౌకరుగా పెట్టుకోమంటున్నారు.''

''నమ్మండి. ఈకుర్రవాడు మంచివాడేఅవుతాడు''

''మీరుకూడా......సరే బాగానే వుందిలెండి. ఇలా ముక్కూమొహం తెలియనివాడ్ని నౌకరుగాపెట్టుకుంటే వాడుమర్నాడు ఏదోతీసుకుమాయమైపోతాడు.

''మీరునమ్మకపోతేనేనేం చెయ్యను''

''ఎలానమ్మను, మీరుకూడా...భలే పరిహాసంచేస్తున్నారు...నరే ఇంక మేం పోయిపడుకుంటాం'

అని ఆయన రోజుకు నాలుగురూపాయలకు అద్దెకు తీసుకున్న మేడమీదిగదిలోకి పడుకోటానికి వెళ్లిపోయాడు.

వకీల్‌గారు తనగదిలోకి వెళ్లిపోయాక హొటల్లోంచి బైటకివచ్చి, నామిత్రుడు తనజేబులో చెయ్యేట్టితడిమిచూచుకున్నాడు. కాని వెంటనే నిరాశాభావంతో మళ్లీ నాకేసిచూడసాగాడు.

"ఏమిటీ?" అని అడిగాడు.

"వీడికి డబ్బులేమైనా ఇద్దామనుకున్నా. కాని అన్నీ పదిరూపాయల నోట్లే ఉన్నాయి." అన్నాడు ఇంగ్లీషులో.

"నాదగిరా బహుశా నోట్లే ఉన్నాయనుకుంటా. అయినాచూస్తా"

అని తీరా చూసేసరికి నిజంగా నాజేబులోనూ నోట్లేఉన్నాయి. మేము మళ్లీ ఇంగ్లీషులో మాట్లాడుకుంటున్నాం. అకుర్రవాడిపళ్లుకొరు క్కుంటున్నాడు. కొంకర్లుపోతున్న చలిగదూ!

"అయితే?" అన్నాడుమిత్రుడు.

"పదిరూపాయలనోటే ఇయ్యి." అన్నాను. మిత్రుడు వెనకాముం దాడుతూ నాముఖంకేసిచూస్తూ" హృదయంలో దయఉన్నంతగాజేబులో డబ్బులేదు మిత్రమా?" అన్నాడు.

"పోనీ. ఈరోజుల్లో అలాంటిదయ ఉండటమే పదివేలు"

..డు ఆలోచిస్తున్నట్లు మెదలకుండా ఊరుకున్నాడు. కానిమళ్లీ "ఇప్పుడేంకాదు. కాని రేపువచ్చి కలుసుకో. ఆహొటలు అక్కడేరేపు పదింటికి వస్తావుగా?" అన్నాడు.

అం. ఏదైనా పనిచూపిస్తారాహుజూర్?"

"అం. అం. అలాగేచూసి ఇప్పిస్తా"

"అయితే వెళ్లనా?" నిరాశాభావంతో అడిగాడు:

"అం." అని చల్లని నిట్టూర్పు విడిచి, "ఎక్కడవడుకుంటావ్?" అని అడిగాడు.

"ఇక్కడే ఎక్కడైనా ఏబెంచీమీదనో ఏచెట్టుకిందనో ఎక్కడో?'

అకుర్రవాడు కాస్తఆగాడు. నేను ఏమితోచనిస్థితిలో పడ్డాను. వాడు పీనుగులాగా ముందుకుసాగిపోయి. ఆమంచులోకలిసిపోయాడు. మేము మాహొటల్‌కేసి బయల్దేరాం. గాలి తీక్షంగానూ, తీవ్రంగానూఉంది. మా కోటుల్లోంచి శరీరానికి బాణపుములుకుల్లాగుచ్చుకుంటోంది చలిగాలి. ముడుచుకుపోతూ, "విపరీతమైనచలి. వాడిదగ్గర గుడ్డలు చాలా

తక్కువగా ఉన్నాయి'' అన్నాడు.

‘‘ఇదిప్రపంచం మిత్రమా!’ అనిస్వార్థమిశ్రితమయిన వేదాంతాన్ని వెలిబుచ్చుతూ, ‘‘పద. ముందువెళ్లి వెచ్చగా పక్కమీద పడుకోనీ, తరువాత అలోచించ వచ్చు ఇతర్లి సంగతి’ అన్నాను.

మిత్రుడు ఉదాసీనంగా, ‘‘నిర్లక్ష్యంఅను కాఠిన్యంఅనుఏమైనాఅను స్వార్థం'' అన్నాడు.

మర్నాడు ఆకుర్రాడు నిశ్చితసమయానికి మాహొటలికి రాలేదు. మేముమానైనిటాల్ విహారంపూర్తిచేసుకుని బయలుదేరటానికిసిద్ధమయాం వాడికోనం ఎదురుచూస్తూ ఉండాల్సిన అవసరం ఉందని అనుకోలా మేము. కారులోబయలుదేరబోతుండగా ఇంతలో- గడచినరాత్రి కొండ జాతికుర్రాడొకడు దారిప్రక్కన చలికి ముడుచుకుపోయి చచ్చిపోయాడని తెలిసింది.

చనిపోపటానికి అదేచోటు-ఆనల్లగా మాసిపోయినచొక్కా మా... దొరికింది. ఆకుర్రాడికి! మానవ ప్రపంచం వాడికిచ్చిన...

ఆ చావుకబురు మాకుచెప్పినవాళ్లే, ‘‘పాపం! అదొర్రా... మీద, రొమ్ముమీద చేతులమీద, కాళ్లమీద, మంచుసన్నని... కప్పేసింది- ప్రంపచంలో లజ్జను కప్పిపుచ్చుకోటానికిప్రకృతి... తెల్లటిమంచు-వస్త్రాన్ని యిచ్చిందికాబోలు!

అంతావిన్ని- వాళ్లవాళ్ల అదృష్టాలు అనుకున్నారు:



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B148 |
| పుస్తకం పేరు | శాంతి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 71 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1+2 |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | Haleema |
| పరీక్ష చేసినది | PRATHYUSHA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |